శ్రీః

# సుందర కాండము

## (గీతికలలో)

వాల్మీకి రామాయణ సుందర కాండమునకు

స్వేచ్ఛానువాదము




రచన:

పి. దుర్గారావు. ఎం. ఓ. యల్.

ప్రథమ ముద్రణము 500 ప్రతులు



అంగీరస నామ సంవత్సరము
గ్రీష్మము - ఆషాఢము.

జూన్ మాసము 1993

వెల : పదునైదు రూపాయలు.

ముఖ చిత్రము : చలం - తారా.

ముద్రణము :
డి. బి. ప్రింటర్స్, అరండల్ పేట,
విజయవాడ - 2.

---

ప్రతులకు ;
పి. దుర్గారావు, యం.ఓ.యల్,
చెఱుకుపల్లి పోస్టు,
(వయా) నక్రేకల్, నల్లగొండ జిల్లా.

స మ ర్ప ణ :

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరమ్ !
ఆరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్ ॥

పుష్పాంజలులతో.



# మాతృవందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీ నిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకళా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

గంగ యమున కృష్ణవేణి - కావేరీ తుంగభద్ర!
ఉన్నత హిమగిరి శిఖరము - లొప్పెడు శుభ కల్యాణీ!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్య గేయశిల్ప - మంజులతర శివగాయిని!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వ దిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర పుణ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సుల నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

# వినయ వాక్యము

దాదాపు నాల్గు సంవత్సరముల క్రిందట కోదాడు మండలం తమ్మరబండపాలెం ఉన్నత పాఠశాల ఉపాధ్యాయ బృందమువారు ఉపాధ్యాయదినోత్సవసందర్భమునసన్మానించి గౌరవనీయులు డాక్టరు శ్రీ మల్లాది గోపాలకృష్ణ శర్మగారు వాల్మీకి రామాయణము సుందరకాండను వ్యాఖ్యానించిన గ్రంథమును నాకు బహూకరించిరి.

వారు బహూకరించిన గ్రంథము ఈమధ్యనే చదువుట తటస్థించినది. ఆ పుస్తకము నన్నెంతో ప్రభావితము గావించినది. దాని ననుసరించి విద్యార్థులకు దెలియునటులుగా లలిత గీతముగా వ్రాయవలెనని సంకల్పించితిని.

ఎందరో మహానుభావులు శ్రీమద్రామాయణ మహా గ్రంథమును గద్య పద్య గీతికా రూపములలో రచించిరి. రచింపుచున్నారు. నాకున్న సంస్కృత భాషా పరిజ్ఞానము స్వల్పాతి స్వల్పము అయినప్పటికీ డాక్టరు మల్లాదివారు వ్యాఖ్యానించిన సుందరకాండ నా గీతికా రచనమునకు మిక్కిలి ఉపయోగబడినది. వారికి మనసార కృతజ్ఞుడను.

గత వేసవి సెలవులలో సుందరకాండమును ప్రతి దినమును రెండుసర్గలు పఠించి, మహోన్నతములైన వర్ణనల జోలికిబోకుండా, కథను మాత్రమే సంగ్రహించి యీ విధముగా గీతికారూపమున గూర్చితిని.

బరువైన పదములు లేకుండునట్లుగా సామాన్యుల కర్థమగునటుల వ్రాయవలెనని భావించి రచించితిని.

గీతికారూపమున నున్న ఈ సుందరకాండము కొంత వఱకు స్వేచ్ఛానువాదముగా భావింపవచ్చును. అచ్చటచ్చటను స్వంతవాక్యములు స్వతంత్ర భావములు ప్రకటింపబడినవి.

ఇందలి ఛందస్సు యతిగాని, ప్రాసగాని ఏదో యొకటి స్వీకరింపబడినది. ముప్పది లఘు గురువులలో పాదము కూర్పబడి పాదాంతమున దీర్ఘముంపబడినది. నాలుగేసి పాదములు ఒక చరణముగా కుదిర్చుచ్చ బడినది. ఆఱువందల ఇఱువది చరణములలో గ్రంథము పూరింపబడినది.

ఈ గ్రంథము నీ రూపమున వెలువడుటకు కారణమైన తమ్మరబంతపాలెం ఉన్నత పాఠశాల ఉపాధ్యాయ బృందమునకు కృతజ్ఞుడను. వారు నా కీ గ్రంథమును బహూకరింపనియెడల నే నీ గ్రంథమును గూర్చెడి వాడను గానేమో!

అటులనే గౌరవనీయులు డాక్టరు మల్లాది గోపాలకృష్ణశర్మగారికి కృతజ్ఞుడను. వ్యాఖ్యతో గూడిన యీ మహా గ్రంథము నాకు గీతి కారచనకు మిక్కిలి తోడ్పడినది. వారికి కృతజ్ఞుడను.

ఈ గ్రంథము వ్రాయుటకు నాకు తగిన అనుకూల వసతి సౌకర్యము కల్పించిన యువకులు, సహృదయులు అడవి దేవుల పల్లి వాస్తవ్యులు శ్రీ చల్లా విజయ రామా రెడ్డిగారికి కృతజ్ఞుడను

గీతికా రూపమైన యీ సుందర కాండము ఎనిమిది ప్రకరణములుగా విభజింపబడి విషయ సూచిక నీయబడినది.

రామాయణ గ్రంథము భారతప్రజలకు ఆదర్శప్రాయమైనది. పూజనీయమైనది. అట్టి మహా గ్రంథమును ఆత్మీయతను స్పృశించుటయేగాక శ్రీ మద్రామాయణములో శిఖరాయమానమైన సుందర కాండమును గీతికా రూపమున రచించి ప్రచురింప గలిగినందులకు ధన్యత నైతినని భావించుచున్నాను.

గీతికా రచనలోగాని, ప్రచురించుటయందుగాని యెట్టి యాటంకములు కలుగనందులకు పరబ్రహ్మ స్వరూపమైన శ్రీరామచంద్ర స్వామికి నమోవాకములు.

ఈ పుస్తకము రసజ్ఞులను ఏమాత్రము స్పందింప జేసినను ధన్యునిగా భావించుకొందును.

సహృదయులు తప్పొప్పులు కార్డుద్వార తెలియజేసిన దిద్దుకొందును.

— రచయిత.



# విషయ సూచిక

ఇందులో —





శ్రీః

# సుందర కాండము

( గీతికా రూపంలో )

## ప్రార్థన

శ్రీరామాయణ పుణ్యకథను జన
    చిత్తము హర్షము రంజిలగా!
మధుర పదములను మధురభావముల
    మల్లెమాలగా నలరింపా!
శ్రీగణేశ్వరుని చిన్మయభక్తిని
    చిత్తము పొంగగ స్మరియింతూ!
శ్రీ భారతి గిరిజామ తల్లులను
    సిద్ధినిగోరుచు ప్రార్థింతున్!

ఆదికవులు శ్రీవాల్మీకుల కిదె
    యలరి చేయుదును వందనమూ!
పూర్వకవులకును పుణ్యమతులకును
    పూర్ణభక్తి నే నర్పింతూ!
రామకథను వ్రాసిన ఘనులకు నిదె
    రమ్య నమస్కృతు లర్పింతూ!
సీతారాముల భజించువారిని
    జేరికొలుతు నే నడుగడుగున్!

ఆ–సేతు హిమాచల పర్యంతంబును
    నలరెడి భారతదేశమునా!
భారతీయులకు పరమాదర్శము
    భవ్యరామ సీతాకథయే!

వారిమార్గమే యాదర్శము మఱి
వారిచరితమే భవితవ్యం!
వాప నడిచినా మధురమార్గమే
వన్నెదెచ్చు జీవనధర్మం!

ముందుగ సుందరకాండను దెలుపుచు
మోద మలరగను బైకథనూ!
ముందుభాగమును దెలిపెద జనులకు
యందుకొనగ మాధుర్యమునూ!
సకలశాస్త్రములు విననేలా మఱి
సర్వగ్రంథముల శ్రమయేలా?
రామాయణ మది విన్నవాలు! భువి
రాజమార్గమగు జీవనమున్!

రామాయణమది మహాసముద్రము
రంజిలు హిమగిరి శిఖరమదీ!
తేటతెలుగులో మహాత్ములెందరొ
తెలియగ దెలిపిరి విశదముగా!
చిన్నిమాటలను జిలుగు బుడుతలకు
తీయని తీయని మాటలతో!
తెలియజేయుటకు బూనుకుంటినీ!
తేనెలొలికెడి పాటలతోన్!

అందులకే నే యఖిలదేవతల
యారాధనలను జేసితినీ!
పదముల నిమ్మని భావము లిమ్మని
భారతాంబ నర్థించితినీ!
ఇష్టదైవమగు విహపరమిచ్చెడి
ఇందిరారమణు రఘుపతినీ!
భక్తిభావమున కరములు మోడ్చితి
భావమునందున నిలువమనీ!

## పావని సముద్రమును దాటుట

సుగ్రీవాజ్ఞను శిరమున దాలిచి శూరవరులు కపివరులంతన్!
సీతను వెదుకగ బయలువెడలతీ చేరి గుంపులుగ దశదిశలన్
రామరామ జయరామరామ యని రమ్యగానములు జేయుచునూ!
నలువైపులకును గదలగసాగిరి నగములు వనములు వెదుకగదూ!

యువరాజగు నంగదుడు నేతగా భువనమంతయును ధ్వనింపగా!
వానరవీరులు బయలుదేరిరట వరుసను దక్షిణ దిక్కుననూ!
ఉదధిజేరుకొని మహేంద్రగిరినీ మోదమలర దిలకించిరటన్!
నీరథిదాటగ నెట్లెట్లనుచును నిశ్చయింప లేకుండిరిగా!

జటాయు సోదరుడగు సంపాతీ జాడలు దెలిపిన విధముననూ!
సీత లంకలో గలదని నమ్మిరి చేరిన వానరవీరులునూ!
నీరధిదాటీ నిర్మలమతి సతి నిఖిలేశ్వరి సీతను జూచీ!
వచ్చువార లెవరని ప్రశ్నించిరి వానరవీరులు దమలోనన్!

మౌనమూనిరీ మాటలు రాకను మది నే నంచును బలుకకనూ!
మిన్నకుండిరీ వానరవీరులు మిలమిలనార్చెడి కన్నులతో!
వయోవృద్ధుడగు జాంబవంతుడట వరుసజూచి పావనితోడన్!
"నీవే తగుదువు! సీత జూచి రా! నిర్మల బలుడవు బవనసుతా!

నీ బలమేమో నీకు దెలియదుగ! నిక్కముగా విను! హనుమంతా!
రామకార్యమును రాజకార్యమును రయమున జేయుము బలవంతా!
సీతను గనుగొని సిద్ధిని గూర్చుము జింతను మాన్పుము రాములకున్!
ఖ్యాతిని బొందుము సకలలోకముల ప్రీతిగూర్చు హరివీరులకున్!"

జాంబవంతునీ పలుకులు వినుచును బవనసుతుం డతి వినయముతో!
రామ! రామ! యని మనసున దలచుచు రమ్యముగా తన శిరమెత్తి!
ఎట్టి యాపదలు రానీ పోనీ! యెట్టి కష్టములు బైపడనీ!
రామకార్యమును రాజకార్యమును రయముగ చేయగ యత్నింతున్!

జానకి లంకను గలదని వింటిమి వినయ సంపాతీ వచనములన్!
రాక్షస రాజగు రావణాసురుని రాజ్యముగద లంకానగరీ!
రామలక్ష్మణులు లేని సమయమున రక్కసు డొక మునివేషముతో!
వెంగవోలె గొనిపోయె జానికిని దోసమటంచును దలపకనూ!

నే దాటెద! నే దాటెద సంద్రము నింగినైన నే దాటెదనూ!
రామకార్యమును రయముగ జేసెద రంగుగ బొందుదు జిరకీర్తిన్!
సుగ్రీవాజ్ఞను శిరమున దాల్చుచు శుభవార్తను నే గొనివత్తున్!
జనకసుతను నే జూచి వచ్చెదను జగతి జనులు నను గీర్తింపన్!

అని పలుకుచు శ్రీయాంజనేయు డపు డందఱి యాజ్ఞను గైకొనెనూ!
జాంబవంత నల యంగదవీరుల నలరిజూచి పవనాత్మజుఁడీ!
సీతారాముల గూర్చువాడవగు! జిరతర ఖ్యాతిని గొనుమనుచున్!
రామదూత! జగదేకవీర! వే! రాక్షసాంతకుఁడ వగుమనుచున్!
పవన తనయునీ యభినందించిరి పరమ ప్రీతి శుభనాదములన్!

అంగదాది కపి వీరులు బావని నభినందింపగ ముదముననూ!
సీతాన్వేషణమునకై లంకకు జేరదలచె నతి వేగముననన్!
నింగి నెగిరి ఘన వీరధి దాటగ నిశ్చయించె తన మదియందున్!
ఎవరు చేయగను లేనికార్యమును నిల దా జేయగ పూనుకొనెన్!

మహేంద్ర పర్వతమందున నిలిచీ మారుతి మహిమాన్వితు డపుడున్!
అజ రుద్రాదుల యింద్ర వాయువుల నర్చన జేసెను ముదముననూ!
పంచభూతముల భక్తిని దలచెను నంచితముగ రాఘవు దలచీ!
రామకార్యమును విఘ్నరహితముగ రయముగ చేయగ పూనుకొనెన్!

ఇంతింతై వటు డింతయైనయటు నంత యాయె హరి వీరుండూ!
తన శరీరమును బెంచెను బావని తరులు గోపురాల్ దాటగనూ!
కొండవోలె గనిపింప సాగె యా దండికపులు నివ్వెఱగందా!
రెండు జేతులను జాచెను బావని నిండు సంద్రమును దాటగనూ!

అంగదాదులను జూచి పలికె నిటు హరివీరుడు పవనాత్మజుడూ!
రామబాణముగ లంక కేగెదను రయమున సీతను వెదుకగనూ!
లంకనంత నే గాలించెదనూ! శంకలేక యటు నణువణువూ!
అంతఃపురములు నడవులు, కొండలు నన్నితావులను బరికింతున్!

లంక జనకసుత లేకుండినచో శంకలేక యా రక్కసునీ!
పట్టిదెచ్చెదను బలవంతముగా పగ్గములను వే బంధించీ!
కార్య సాధనమె కార్యము నా కిల కర్తవ్య మదే కపులారా!
సీతాదేవిని దోడి తెచ్చెదను శీఘ్రముగా నే నెటులైనా!

అని పలుకుచు శ్రీ అంజనా సుతుడు అంబరమునకును బయనించెన్!
పక్షివోలె దా గగనమునందున బన్నుగ యెగురుచు బోదొడగెన్!
మేఘమునందున మెఱుపు దీగెలా మెలగ జూచ్చె పవనాత్మజుడూ!
మబ్బుల లోపల జందమామలా మలిగిన రీతిని బోదొడగెన్!

పవనసుతుడు దన గమన వేగమున పన్నుగ నెత్తిన వాలముచే!
ఇంద్ర ధనువు వలె విను వీధుల నది యింపును గూర్చుచ గనిపించెన్!
వలయముగా జుట్టిన యా వాలము వన్నెలు జిందెను గగనమునన్!
గూడు గట్టినా సూర్యమండలము గూడిన విధమున నింపొందెన్!

జలధిపైని పయనించు కపివరుని కదిలెడు గాత్రము నీరమునన్!
తెరచాపను కట్టిన నావకువలె తెరల నలల గనబడ దొడగెన్
కొండవోలె పెనునీడ నీటిలో దండిగ కదులుచు గనిపించెన్!
కదిలెడి నల్లని మేఘరాశిగా గాంతులు జిందుచు జిత్రముగా!

చాచి చేతులను జీల్చి మేఘముల చయ్యన ముందుకు జొవు వెడన్!
ఉఱుము చందమునను గర్జనసేయును మెఱుపు దీగెవలె బయనించున్!
అంబుధిలోనీ యలలను దాకును నటుపై గగనముపై కురుకున్!
అలసట నెఱుగని అంజనాసుతుడు నలరి త్వరితముగ పయనించెన్!

సాగను డప్పుడు దనివి దీరగా దన్మయమందగ కపివీరున్!
తనపై బోవుట జూచి మురిసి మది తగ నీ విధముగ చింతించెన్!
రామ కార్యమును జేయ వేగమున రయమున బోయెడి పావనికిన్!
సేదదీర్చి యాతిథ్య మిచ్చి మఱి తీయని మాటల బంపెదనూ!

ఇక్ష్వాకుల వంశస్థుడు సగరుడు ఇనకులంబునకు దీపకుడూ!
సగర నరేశ్వరు దయచే నాదగు సంద్రము వెలసెను భువియందున్!
అట్టి మహాత్ముని యలరెడి వంశము నందు జనించిన రాములకూ!
ప్రత్యుపకారము సేయుట నా విధి ప్రగతికి యది సోపానమగున్!

అని తనలో దాగిన మైనాకుని యాదర మొప్పగ వే బిలిచీ!
అంబర వీధిని యరుగు బావనికి యాతిథ్యము నొసగను బనిచెన్!
ఉత్తములకు నాతిథ్య మొసంగుట యున్నత శ్రేయము లొనగూడున్!
మంచి కూర్పు; మర్యాద హెచ్చు; మఱి మన్నన లెన్నియొ సమకూడున్!

అది విని మైనాకుడు భాగ్యమనీ యంతరంగమున నుప్పొంగీ!
జలధి నుండి పైకుబికి వచ్చి తా యలల దేలుచును నుయ్యెలగా!
మానిసి రూపము దాల్చి నగముపై మర్మముగా గపి వీరునితో!
పలుకసాగె మది పరవశింపగా పందిరి రాలిన మల్లెలుగా!

అనితర దుష్కర కార్యము జేసెడి! యాంజనేయ ఓ బలవంతా!
సాటిలేరు నీ వీర పరాక్రమ సాన్నిధ్యములో నిలువగనూ!
వినువీధిని సంద్రము పైపైనీ వేగ జనెడి ఓ పవనసుతా!
క్షణ మాత్రము నిట శ్రమను దీర్చుకొని చయ్యన బోదువు రావయ్యా!

సగరుని చేతను వృద్ధి నొందినది సాగరమిది కద వినవయ్యా!
అట్టి సగరునీ వంశమునందున యలరిన రాఘవు పనిమీదన్!
అరిగెడి నీ కాతిథ్య మొసగుమని యంపెను నను నీ సాగరుడూ!
మఱియొకటున్నది మంచి మాట యది మనవి చేసెదను వినుమయ్యా!

కృతయుగ మందున కొండలన్నిటికి మతిమంతుడ తెక్కలు గలవూ!
పక్షులవలె నవి యెగురు చుండెడివి పన్నుగ భువియం దంతటనూ!
పర్వతములు వ్రాలిన చోటెల్లను! సర్వము ధ్వంసంబయ్యెడిదీ!
మునులు ఋషులు ప్రార్థించిరి శక్రుని ముప్పు దొలగ వే గావుమనీ!

సహస్రాక్షు డంతట కోపముతో సరగున వజ్రాయుధముననూ!
కొండల తెక్కలు పిండి పిండిగా చెండివేసె నతి బెండులుగా!
సురవల్లభు నే జూచి భయంపడి సుడివడి హా! యని మొఱపెట్టన్!
వాయుదేవు డిట వచ్చి పడునటుల వార్ధిని వేగము నను జేర్చెన్!

తెక్కలతోడను జక్కదనముగా నిక్కడ యుంటిని హనుమంతా!
సంద్రములో నే దాగి యుంటినీ! చంద్రుడు మబ్బుల యున్నటుగా!
అట్టి వాయుదేవుని కుమారుడవు నంతులేని బలవంతుడవూ!
ఇపుడు నీకు నే బ్రత్యుపకారము నింపుగ జేయుట ధర్మంబౌ!

కావున నా దగు వినతి జే కొనుము! కమ్మని నా సేవలు గొనుమా!
కందమూలములు పూలు పండ్లు నీ కంది యిచ్చెదను గైకొనుమా!
సాగరునీ, మఱి మైనాకుని నా సరస ప్రార్థనలు మన్నించీ!
క్షణమాత్రము నిట విడిది సేసి మము ధన్యుల జేయుము బవనసుతా!

ఆ మాటలు విని హనుమంతుడు దా నాత్మయందు సంతసమందీ!
మైనాకునితో నిట్లని పలికెను మమత చిందునటు హృద్యముగా!
మాటయె చాలును! మమతయె చాలును! మన్నన చాలును మైనాకా!
స్వామి కార్యమై బోవుచుంటినీ! రామకార్యమై రయముననూ!

మధ్య నెచ్చటను నాగబోననుచు! మాట యిచ్చి కపి వీరులకూ!
జనకసుతను నే వెదుకుట కొఱకై జనుచుంటిని వే వేగముగా!
క్షణ మాలస్యము నే జేసినచో చెడును కార్యములు నొక్కొకచో!
పోయివచ్చెదను నాశీస్సులచే బులకల గూర్పుము మైనాకా!

అని తన కరమున నా మైనాకుని యనితర స్నేహమునను దాకి!
పైకిపోయి యాగగనమునందున పయనమగుట వే కనిపించెన్!
మైనాకుడు కడు హర్షమంది తన మనసున బూవులు బూయగనూ!
సీతను గాంచీ కృతార్థు వగుమని చెన్నుగ శుభదీవన లొసగెన్!

అంత పవనసుతు డంతరిక్షమున నతి వేగముగా బయనింపన్
సురలు పుష్పవృష్టిని గావించిరి సురుచిర మధుర సుగానములన్!
ఱెక్కలులేనీ గరుడుని వలెనూ రిక్కవోలె బయనింపగనూ!
అద్భుత దుష్కర కార్యమనుచు నా యమర గణంబులు గొనియాడన్

మైనాకుని దీవన తలదాల్చి మదిలో శ్రీరాముని దలచీ!
అంతరిక్షమున నరుగగ సాగెను హరి వీరుడు బవనాత్మజుడూ!
అంత సురలు గంధర్వులు నాగులు యా కపి వీరుని దర్శించి!
బలపరాక్రమము బరీక్షింపగా బన్నుగ దలచిరి యా క్షణమున్!

నాగమాత సురసా దేవిని గని నర్మముగా దేవత లపుడూ
తెలియజేసిరీ కపి వీరునికి కలుగజేయ క్షణ విఘ్నమునూ!
రాక్షసి రూపముతో గపి వీరుని రౌద్ర రసముచే బెదిరించీ!
విఘ్న మాచరింపుము క్షణ మాత్రము! విడ్డూరముగా గాంతుమనీ!

అంత సురస వికృత రూపముతో నరిగె పావనికి యడ్డముగా!
కొండవోలె నిలుచుండి యడ్డముగ దండిగ మాటలు నిటు అనియెన్!
ఓ కపి వీరుడ! నాకాహారము నౌనరగ కమ్మిక వేగముగా!
అజుడు దేవతలు బూర్వము నిచ్చిన యాజ్ఞను నే బాలింతు సుమా!

అనుచు సురస తన నోరు దెరువగను హరివీరుడు నతివినయముగా!
దశరథ తనయుడు రామవిభుడు తన తండ్రి యాజ్ఞ పాలించుటకై
తమ్ముడు లక్ష్మణ దేవర తోడను ధర్మపత్ని సీతను గూడీ!
దండకావనము నందు జరింపగ దండి రక్కసుడు రావణుడూ!

రామలక్ష్మణులు లేని సమయమున రావణు డొక ముని రూపమునా!
సీతను గైకొని పోయె లంకకును జెన్నుగ నే నీ సమయమునా!
సీతను వెదుకక బోవుచుంటినీ చింతదీర్ప శ్రీరాములకూ!
రామకార్య మిది విఘ్నము సేయకు రయమున దొలగుము నా దారిన్!

ఆహారముగా మఱలువచ్చి నే నగుదునమ్మ నీ సంతృప్తిన్!
దేవమాతవని తెలియనులే నీ ధీశక్తియును తెలియనులే!
వదలవమ్మ నను ఓదాక్షాయణి! కదిలిపొమ్ము వే దూరముగా!
మంచిపనుల కిటు విఘ్నము సేయుట మానినులకు నిది ధర్మంబా?

దేవమాత యటులే పిలిచెను దా ధీమత యా హనుమంతునితో!
తనను దాటిపోలేవని బలికెను దప్పిపోవనుచు వ్యంగ్యముగా!
బ్రహ్మయిచ్చినా వరమిది పూర్వము బ్రతుకెక్కడిదిక నీకనుచున్!
నోరుదెఱచి నిలుచుండెను సురసా! నూరుచు కారాల్ మిరియాలున్!

అంజనేయుడట పెరిగెను బెద్దగ యంతట సురసయు దా బెరిగెన్!
పావని పెరిగెను మఱింతగా మఱి పన్నుగ పెరిగెను సురసయునూ!
పెరిగెను బెరిగెను బవనసుతుడు దా బెనుకొండంతటి రూపముతో!
తెఱచె తెఱచె సురసయు తన వక్త్రము దీర్చి భూమి యాకసములనూ!

వాద మెందుకని దేవమాతతో వడిగా బావని తన తనువున్!
సూక్ష్మరూపముగ పరిణతి జెందీ జొచ్చె సురస పెను వక్త్రమునన్!
బయలువెడలి యా కపివరుడు తన బాహువులను వే జోడించి!
వెళ్ళివచ్చెదను! ఓ దాక్షాయణి వేగముగా సెలవును నిమ్మా!

అంతట సురసాదేవి జూచి హనుమంతుని సాదరభావముతో!
"ఓ కపివీరుడ! కార్యసిద్ధి నీ కౌనరుగాత" యని మోదమునన్!
పరీక్షయందున జయమొందితి విక పావని! శుభమగు నీ కెపుడున్!
సీతారాముల జతను గూర్పుమని జేసెను నాశీర్వాదములన్!

నీ కోరిక నెఱవేరెగదమ్మా! నిఖిలేశ్వరి! ఓ సురమాతా!
వక్త్రగహ్వరము జొచ్చి వెడలితిని వందన మిదె గైకొనుమమ్మా!
బ్రహ్మవరంబును జెల్లిపోయెకద! పాలించితి కద! నీకోర్కెన్!
మఱలవచ్చెదను మఱువబోకు నను మాతా! న న్నాపదలందున్!

వైనతేయువలె వాయువేగమున వాయుసుతుడు దా పయనించెన్!
వాయుమార్గమున చంద్రసూర్యులా వన్నెల జిందుచు బోదొడగెన్!
మేఘమాలలో దూరుచు వెడలుచు మిలమిల మెఱిసె చంద్రునిలా!
అంతరిక్షమున యాముహూర్తమున యాంజనేయు దపు డగుపించెన్!

తెక్కలులేనీ పర్వతంబువలె యక్కజముగ యెగిరెడి కపినీ!
సింహికయను నొక రక్కసి కనుగొనె చింతజేసె తనమదిలోనన్!
ఇంతకాలమున కెంతభాగ్యమని సంతోషంబున నుప్పొంగెన్!
ఇంతగొప్ప జీవము దొరికినదని గంతువేసె నుత్సాహముతో!

ఛాయను బట్టుక లాగగ సాగెను చతురత క్రిందికి గపివీరున్!
నోరుదెఱచుకొని కాచియుండె నది విఱుచుక తినగా వికృతితోన్!
గమనవేగ మది తగ్గిపోవుటను గమనించెను గపివీరుండూ!
ఎవరో క్రిందికి లాగుచునున్నా రెందుబోదురని పరికించెన్!

క్రిందికి పైకీ నటు నిటు గనుగొని క్రిందిభాగమున గమనించెన్!
అర్ణవమున నొక మహాజంతువది యగుపించెను పావనికపుడూ!
ఛాయను బట్టుక యాకర్షించెడి జంతువిదియెయని మది నెంచెన్!
సుగ్రీవుడు జెప్పిన జంతువు నిజె సూటిగ సింహిక యిది యదియే!

హనుమంతుడు దన కాయము బెంచెను నంతటి వక్త్రము సింహికయున్!
బెంచి పావనిని లాగుచునుండెను యంచితముగ ఛాయను బట్టి!
అంత జూచి కపివీరు డంతలో యలరి సూక్ష్మ రూపముతోడన్!
సింహిక గర్భమునందు జొచ్చి మఱి సింహరూపుడై వెలుగొందెన్!

వాడిగోళ్ళతో వడివడి సింహిక వక్షోము నుదరము జీల్చుచునూ!
రాహువు విడిచిన చంద్రునివలె దా రయమున వెలుపల కేతెంచెన్!
ధైర్యము కాలోచిత ప్రవర్తనము దైవానుగ్రహ బలముననూ!
రామభక్తుడా హనుమంతుండట రయమున సింహిక బరిమార్చెన్!

హనుమంతుని యాయద్భుత కార్యము నందఱు జూచిరి సురమునులున్!
పుష్పవృష్టి దేవతలు గురిసిరీ పున్నమి వెన్నెల వర్షముగాన్!
అచ్చరలాడిరి కిన్నెరాంగనలు నటుబాడిరి సంగీతములన్!
మునులు, ఋషులు నాశీర్వచంబుల మోదము జేసిరి పవనసుతున్!

సూక్ష్మదృష్టి, మేధస్సు, ధైర్యమును సురుచిరకార్య దృఢత్వంబున్!
ఎవరికుండునో·వారేగద భువి యెదురులేని సామర్థ్యమునుల్!
అవి నీకున్నవి యాంజనేయ యీ యనితర కార్య పటుత్వమునన్!
మహాసత్త్వమును బరిమార్చితివీ మఱి నీకార్యము జేయుమికన్!

శుభము నీకగును వీరహనుమ! నీ సురచిర యత్నము సఫలమగున్!
అంచు దీవనలు జారణు లివ్వగ యలసట యెఱుగని కపివరుడూ!
రామ రామ యని మనమున దలచుచు రయమున నింగిని బయనించెన్!
గరుత్మంతువలె యెగురసాగెనూ గమ్యమునకు జూపును నిల్పి!

శతయోజనములు నంతరిక్షమున సంద్రముపైనీ పయనించీ!
చేరె లంక భూభాగము మారుతి చిత్తము హర్షము జిగురింపన్!
లంకాద్వీపము రమణీయములగు లాలితవనములు గమనించెన్!
చేసినయత్నము సఫలమాయెనని చిఱునగవుల మది జిందింజెన్!

సుందర సాగర తీరభూములను సురుచిర తరులత వనములనూ!
నదీనదాలట సంద్రములో బహు నవ్యశోభలను దిలకించెన్!
కమ్మని వాసన గంధపు తరులను కాంతులుజిందే మలయగిరిన్!
వాయుసుతుడు నానంద మొందెనూ! యద్భుత ప్రకృతి లీలలకున్!

ఈ రూపముతో నను గాంచినయెడ యిట్టి రక్కసులు గమనించి!
కౌతూహలమున నను జూచెదరిక కార్యము యత్నము వ్యర్థమగున్!
చిన్నిరూపమును నే ధరియించెద చిఱుతమర్కటము నైపోదున్!
అని యామారుతి రూపము మార్చెను అతి సహజమునగు కపిరూపున్!

బలిని రసాతల మంపుటకౌఱకయి పన్నగశయనుడు బెటిగినటుల్!
సంద్రముదాటగ కపివీరుడు దా చతురత బెఱిగెను బెనుకొండై!
కార్యసాధనకు బిమ్మట శ్రీహరి గలరూపము దా బొందినటుల్!
పవనసుతుడు గూడను దన రూపము బన్నగ సహజముగా మార్చెన్!

వర్షాకాలపు మేఘము రీతిని వన్నెలు జిందెడి పర్వతమున్!
త్రికూటపర్వత శిఖరముపైని త్రినేత్రువలె పాదముమోపెన్!
సంద్రపునొడ్డును జేరుకొనియె హరి చలించు దరగల గమనించెన్!
చక్కనైన రాముని మది దలచెను మ్రొక్కెను జేతులు జోడించి!

పర్వత శిఖరము పై నిర్మించిన పట్టణమును లంకను జూచెన్!
అమరావతివలె కాంతులు జిమ్ముచు నపురూపముగా గానబడెన్!
అనితర దుష్కర కార్యమైన యా యంబుధిపైని పయనించి!
లంకనుజేరెను హరివీరుడు నే శంకలేక సీతను వెదుకన్!

త్రికూట పర్వత మందున నిల్చి తియగ పావని తిలకించెన్!
లంకానగరీ యందచందములు లాలిత లక్ష్మీ నిలయంబున్!
బంగరు మేడలు పవడపుగోడలు శృంగారపు తిన్నని వీధుల్!
కలకలలాడే జనసందోహము కాంతులుజిందే పూదోటల్!

పుష్పభారమున వంగిన తీవెలు పొలుపుగ రాల్చుచు బుష్పొడులన్!
మెల్లని మకరందంబుల కాల్వలు నుల్లములలర పావని జూచెన్!
సకల వృక్షజాతులతో నుండెడి సాధువనములను గనుగొనియెన్!
జలాశయంబుల, సరసుల, కొలకుల సర్వశోభలను దిలకించెన్!

ఉగ్రాయుధముల ధరించి నిలిచిన యున్నతులగు రాక్షసుల గనెన్!
అప్రమత్తులై పహరా నిచ్చుచు నఱచెడి యా దానవుల గనెన్!
బంగారపు ప్రాకారము గనుగొని భళియని మారుతి మెచ్చుకొనెన్!
దేవపురిని దేవత గాంచిన విధి ధీరుడు హరి వీరుడు గాంచెన్!

లంకా పట్టణ రక్షణ స్థితిని లంకనేలు రావణు బలమున్!
చుట్టు సముద్రము నలల తెరలనూ జూచి కపీశ్వరు డిటు దలచెన్!
ఇట్టి బలీయము నీలంకన్ మఱి యెట్టి బలాఢ్యులు జేకొనగా!
దేవతలైనను దీటుగారు నిక ధీరులు వానరు లే పాటి?

మహా వీరుడగు రామచంద్ర ప్రభు మఱి జయించునా యీ లంకన్!
లక్ష్మణ దేవర యేమి చేయు నిక లవణాంబుధి యేవిధి దాటున్?
జాంబవంత, నల, యంగదాదులును సరసత నేనును నల్వురమూ!
నీరధి దాటగ శక్తి గలిగినా ధీరుల మింతియు యెటులగునో?

పరి పరి విధముల శంకించుచు మఱి పావని యీ విధముగ దలచెన్!
జీవముతో నున్నదా లేదో మఱి సీతా మాతను గనుగొందున్!
జనక సుతను నే గనుగొని పిమ్మట కర్తవ్యము నాలోచింతున్!
బుద్ధిమంతుడును దూరదర్శియును పొలుపుగ మారుతి మది దలచెన్!

తొందరబడి కార్యములు జేయుటది చింది చెడును కార్యము లెపుడున్!
దూత చేయవలె తడబడకుండగ దూర దృష్టితో నెమ్మదిగా!
ప్రభు కార్యమునకు హాని వచ్చు మఱి విభుకార్యంబులు జెడిపోవున్!
జనక సుతను నే జూచిన పిమ్మట సర్వము నాలోచింతు మదిన్!

ఈ రూపమునను జూచినచో నను నీ రక్కసు లిక దరిమెదరూ!
కార్యహాని యగు గావున యిప్పుడిక గల రూపంబును మార్చుకొని!
రాత్రి వేళ నే లంక జొచ్చెదను రయమున సీతను వెదుకగనూ!
అని మతిమంతుడు యాంజనేయు డటు నాత్మను దలచెను గుశలతగా!

ఉత్తర ద్వారము కడకు వచ్చి యా ఉన్నత రూపము మార్చుకొనీ!
మార్జాలము నంతటి రూపముగొని మర్మముగా మారుతి వేగన్!
అంచితముగ రవి యస్తమించుటకు పొంచి యుండె కపి వీరుండూ!
విధి యూహించిన రీతి యాడవలె వీరులు కూడ లదెవరైనా!

అంత రూపమును పవనసుతుడు వే యింత రూపముగ మార్చుకొనీ!
లంబ పర్వతము నుండి వచ్చి యా లంక యందునను బాదమిడెన్!
సుందర మగు యా నగర శోభలను జూచెను నద్భుత దృశ్యములన్!
అలకాపురి వలె యందము లొప్పెడి యా లంకాపురి కనుగొనియెన్!

ఫల పుష్పంబుల తరులతాదులను కల కల లాడెడి వనవీధుల్!
కలువ తామరల జలాశయంబులు చలువలు జిమ్మెడి పూపొదలున్!
రాజహంస శుక శారికా ధ్వనుల రమణీయములగు ఉపవనముల్!
ఆంజనేయు డప్పు డలరి జూచి తన యాత్మయందు సంతసమందెన్!

మనసు చేతనే విశ్వకర్మ యట మణి నిర్మించెను నా పురినీ!
కైలాసమువలె జుక్కల నంటుచు గగన వీధి నిర్మింపబడెన్!
ప్రాకారము లెన్నియొ గలవచ్చట ప్రబల దానవులతో గూడీ!
రథాశ్వ గజభట సంఘము లచ్చట కదము త్రొక్కుటను హరి జూచెన్!

చుక్కల నంటెడి యింద్ర భవనములు జోద్యముగా నట కన్పించెన్!
మణులు దాపినా గృహ ద్వారంబులు మంచి ముత్తెముల తోరణముల్!
చంద్ర శాలలను పాన శాలలను సాంద్రమైన సుఖ ఖేలనలన్!
విలసిల్లిన యాలంకను గనుగొని వేడుక జెందెను మది యందున్!

ఇట్టి లంక నెటు జయింపవలెనవి పుట్టెశంక మారుతి మదిలో!
ముహూర్త మాత్రము శంకను జేసీ మునిగెను జింతా భరముననూ!
రామలక్ష్మణుల పరాక్రమములను రయమున దలచీ యుప్పొంగెన్!
రామ బాణమున కెదురు లేదనుచు రమ్య భావమున నుప్పొంగెన్!

హనుమంతుడు జనుచుండ నంతలో నా లంకేశ్వరి భీకరతన్!
నిజ రూపముతో నిలిచి పావనిని నిలదీసెను జెనుకేకలతో!
ఎవడవురా కపి? యెందు వాడవుర? యెందు కొచ్చితివి? యేమి పనీ?
నిజము జెప్పు! మఱి ప్రాణములుండవు! నీల్గుదు విప్పుడు నా చేతన్!

పుర ద్వారంబున నిలిచినదానవు! పొలతి చెపుమ! నీ వెవ్వరవూ?
బెదరింపులు నిక మాని దెలుపు నీ పెద్దఱికంబును విననియెదనూ!
అని పావని పలుకగ లంకేశ్వరి యగ్ని వోలె భగ్గున మండే!
లంకేశ్వరినిర! లంకను నేనుర! లంకకు రక్షకురాలినిరా!
రావణాసురుని యాజ్ఞను మెలగుచు రక్షణ సేయుచు నుంటినిరా!

అయితే నా దొక మాట వినుమనుచు నలరి పలికె మారుతి యంతన్!
సుందరమగు నీలంకానగరము జూడ వచ్చితిని ముచ్చటగా!
నను బోనిమ్మొక క్షణమున వచ్చెద నమ్ము మనుచు నా లంకిణినీ!
వినయముతో బలుకగ లంకేశ్వరి వికృతి మతియై కేకలతోన్!

మాయ రూపమున వచ్చిన వాడవు మాటయె దెలుపుచు నున్నదిరా!
ఇంద్రుడవా? మఱి చంద్రుడవా? మఱి సాంద్రరూపుడగు పవనుడవా?
నను జయింపకను బోరాదెవ్వరు నా మాటను విను వానరుడా!
అనుచు నంత చేజాచి మారుతిని యఱచేతను వీపున జఱచెన్!

అంత పవన సుతు డతి కోపముతో నతి బలవంతుండై పెరిగె!
ఎడమ చేత పిడి గ్రుద్దు మోదెనూ కడు వేగముతో లంకిణినీ!
ఆ పిడి గ్రుద్దుకు నా లంకేశ్వరి యఱచుచు నేలను గఱచుకొనెన్!
వికృత రూపమున మోము వెట్టి తా విల విల తపియింపగ దొడగెన్!

పడిన లంకిణిని జూచి యార్ద్రితను పవన సుతుడు మది చింతించెన్!
స్త్రీ యని మనసున దలచి కరుణతో జేరి లంకనూ నోదార్చెన్!
అంత లంక యుద్విగ్న భావమున హనుమంతునితో నిటులనియెన్!
మహా బాహూ! బలవంతు లెపుడును మర్యాదను గాపాడుదురూ!

హే వనీ! నీచే జయింపబడితినీ! పన్నుగ నా దొక మాటవినూ!
లంకా ద్వీప స్వరూపము నేనూ! లంకను! నే లంకేశ్వరినీ!
బ్రహ్మ యిచ్చినా వరమును విని నా భావము మనసున నుంచుకొనీ!
నను మన్నింపుము! నన్ను క్షమింపుము! నా జేసిన యపరాధమునూ!

ఒక హరి పేరని యంచిత బలమున నోరిగి పోదువో యానాడే!
లంకకు, రాక్షసులకు దుర్దిన మది, సంకట మది రావణునకునూ!
అజు డిచ్చిన వర మది నిజమగు నీ యంచిత కార్యము సమకూరన్!
సీతను వెదకుము జేర్పుము రాముల! జగతికి మేలును సమకూరన్!
నీ పనులేవో లంకలోపలను నెఱవేర్పుము నిర్భయముగనూ!

లంక కాపదలు రానున్నవి సూ! రాక్షస బలములు నశియించున్!
రామ బాణముల కెదురు లేదు సుమ! రాముడు దేవుడు రక్షకుడున్!
ఆ మాటలు విని యంజనా సుతుడు నలరి మోదమున నుప్పొంగెన్!
రామ! రామ! యని ముందుకు సాగెను రమ్య సూక్ష్మరూపము దాల్చి!

## సీతాన్వేషణము

పవన సుతుడు తన పరాక్రమముచే పన్నుగ లంకను బడద్రోసీ!
మార్గాలము నంతటి రూపముతో మానుగ ప్రాకారము దాటీ!
ఎడమ పాదమును మోపి లంకలో సడి లేకుండగ పోయెనుగా!
లంకిణి మాటలు నిజమగు నట్టుల రాక్షస నాశము జరుగునటుల్!

అందమైన యా లంకా నగరము నందములను గని తిలకించెన్!
రాజ మార్గములు రమ్య భవనములు రంగుల వెలిగెడి దీపములున్!
సుఖ సౌఖ్యములను నోల లాడుచును సుందర లక్ష్మీ కాంతలతో!
అమరావతి వలె నా లంకాపురి యపురూపముగా నగుపించెన్!

ఎచట జూచినను వాద్య ఘోషములు నెందు జూచినను నాట్యములే!
మృదంగ ధ్వనులే వీణా స్వనములు మృదు లలిత స్వన గీతములే!
హంస పద ధ్వని హసిత రాగములు, హద్దులేని శృంగారములే!
ఆ లంకాపురి యంద చందములు నా కపి వీరుడు దిలకించెన్!

ఉన్నత గృహములు నెచట జూచినా యూహకందనీ సంపదలూ!
బంగరు మేడలు బట్టు తోరణాల్ రంగుల మేల్మి పతాకములే!
అచ్చరలను బోలిన స్త్రీలచ్చట యందెల మ్రోతల గమనించెన్!
ఆ లంకాపురి యంద చందములు నా కపి వీరుడు గమనించెన్!

రాక్షస సైనిక వీరులు దిరిగెడి రాచ బాటలను గమనించెన్!
రథ గజ భట తురగాది బలములా రాణువ లచ్చట దిలకించెన్
వేద ఘోషనులు విప్రవాదములు వినిపించెను మారుతికి నటన్!
ఆ లంకాపురి యంద చందములు నా కపివీరుడు దిలకించెన్!

సాధు సజ్జనుల సౌమ్యవర్తనుల సౌమ్య వచనముల నట వినియెన్!
పానశాలలను చిత్రశాలలను బన్నుగ జూచెను బ్రతివీధిన్!
రామకార్యమై వచ్చిన మారుతి రయమున సిల్లిలను దిరిగీ!
ఆ లంకాపురి యందచందములు నా కపివీరుడు గమనించెన్!

ఆ లంకాపురి జూచె గపివరుడు నా రక్కసుల విరూపములన్!
వికృతాకారుల వింతరూపులను వివిధాయుధముల ధరియించీ!
కోరలు జాపి నాల్కలు దెరచీ కువలయ మంతయు దద్దరిలన్!
పెనుకేకలనూ వేయుచుండుటను గనుగొనె మారుతి యచటచటన్!

లంకనంత పావని కనుగొనెగానీ లలిత జానకిని గనలేదూ!
గృహ గృహమును దా వెదకి వేసరిలి తహ తహ లాడెను జింతిలుచున్!
గగనము నందున గొంతులు జిమ్మె కలువల రాజును గనుగొనియెన్!
వెన్నెల పువ్వుల తెల్లదనములో వేడుక వెదకెను గృహ గృహమున్!

అందమైన బహూ నలంకరణలను మెఱసెడి కాంతల దిలకించెన్!
విరహవేదనను సతమత మయ్యేడి విహ్వల చిత్తల గనుగొనియెన్!
గీత వాద్యముల మత్తెక్కించెడి కిన్నెరకాంతల దిలకించెన్!
కాని పావనికి గనిపింపదు నా కమలనయన జానకి మాతా!

మేలి ముసుగులో బంగరు కాంతుల మెఱసెడి కాంతల దిలకించెన్!
ముసి ముసి నవ్వుల పతులను దేల్చే ముచ్చట లొలికే జవరాండ్రన్!
మధుపానముచే సోలుచు తూలుచు మత్తిలునట్టి మధుమతులన్!
గాంచెను బావని కాని కాని మఱి గాంచడు! గాంచడు జనకసుతన్!

రాముని సతి జనకుని కుమారై శ్రీరమ్య గుణశీల జానకినీ!
ఆంజనేయుడట గనలేకను తన యంతరంగమున జింతించెన్!
ఎట నున్నదొ సీతా మాతా యని కటకట బడె కపి వీరుండూ!
బిర బిర లంకాధిపు గృహమునకును జెర చెర నేగెను నాసక్తిన్!

కామరూపమును ధరించి పావని రామ రామ యని మది దలచీ!
రావణు నంతఃపురము జొచ్చెనూ రయమున సీతను శోధింపన్!
మహా సంపదల నిలయంబగు నా రాజభవనమును దర్శించెన్!
సకలవస్తు సముదాయను జూచెను సార్వభౌముని గృహమందున్!

మణులు ముత్తెములు దాపిన గోడలు మహిమాన్వితమగు చిత్తరువుల్!
అడుగడుగున యా భవనమంతయును నపురూపముగా నగుపించెన్!
అందమైన బహు విలాసినులతో నానందార్ణవ మనునటులన్!
వీణా వేణు మృదంగ నాదములు వేడుకగా నట వినిపించెన్!

రథ గజ భట తురగాదుల తోడను రక్షణసేయుట గనుగొనియెన్!
ప్రబల రాక్షసులు నాయుధపాణులు విభవముతో నట గొలువుంటన్!
చంద్రశాలనూ; చిత్రశాలనూ; సాంద్రమైన యాసవశాలన్!
కమనీయంబగు గాంతులు జిందెడి కామ గృహంబును దర్శించెన్!

శుకపిక శారిక కపోత ధ్వనులను సుందర మయూరి నృత్యములన్!
రాజహంసలట నడయాడుటనూ రమణీయత నట కపిగాంచెన్!
రాక్షసు లెప్పుడును నిత్యార్చనలను నిర్మలనుతి నర్చనసేయూ
పర్వతసుత దేవాలయం బచట భక్తిని పావని వీక్షించెన్!

మంత్రుల గృహములు సేనాపతులను మఱి రావణు బంధుల గృహముల్!
ఉన్నత పదవుల నున్నవారియును సన్నిహితుల సదనంబులలోన్!
మఱల వెతుకని గంతువేసి యా మహా రాక్షసుల గృహములకున్!
సీతను వెదుకగ బోయెగాని మఱి సీత జాడ కనిపింపదుగా!

పవనసుతుడు వే ముందుగ వెడలెను ప్రహస్తునింటికి దూకుచునూ!
మహాపార్శ్వునీ కుంభకర్ణునీ మఱి విభీషణుని గృహమునకూ!
విరూపాక్షునీ విద్యుజ్జిహ్వుని విద్యున్మాలీ గృహమునకూ!
సీతను వెదుకగ బోయెగాని మఱి సీతజాడ లేదందందూ !

జంబుమాలి శుకసారణు లిండ్లకు జేరి చూచె పావని యప్పుడూ!
సుమాలి శుకనాభుని యిండ్లకు జని సూర్యశత్రునీ భవనమునన్!
రాక్షస వీరుల దానవశూరుల రమ్యభవనముల గనుగొనెనూ!
సీతను వెదుకగ బోయెగాని మఱి సీతజాడ లేదెందెందూ!

సీతను గానక చింతిలి మారుతి చేరి రావణుని భవనమునూ!
అడుగడుగుననూ యరసి జూడగా నాత్మ నిశ్చయము జేసికొనెన్!
కార్యసాధకులు కార్యము నెపుడును కర్మగతికి నర్పింపరుగా!
పురుషయత్నమును జేసి పొందుదురు పూర్ణసిద్ధులను జయమందన్!

అట జని కాంచెను నంజనాసుతుడు నా రావణు భవనమునందున్!
ఇంద్రభోగముల రాజిల్లెడి యా యింపగు సుందర హర్మ్యమునన్!
చిత్రశాలలను లతాగృహములను జెక్కిన బంగరు శిల్పములన్!
అంతులేని సుఖసంపదలకు నది యమరిన కూడలి యని మెచ్చెన్!

అట నొక భవనమునందున జూచెను నంతులేని నవరత్నములన్!
మణులు ముత్తెములు వైడూర్యంబులు మహా సూర్యువలె వెలుగొందన్!
రాక్షసేశ్వరుని జయలక్ష్మి యనీ రమ్య సంపదల గని యంచున్!
అబ్బుర మందెను నంజనాసుతుడు నా సంపదలను గనుగొనుచున్!

లంకేశ్వరునీ విమాన గృహమును రమ్య భవనమును వీక్షించెన్!
స్వర్గ సౌఖ్యముల నిలయంబన నది సర్వవస్తు సముదాయమనన్!
విలాసవతులను నొయారగత్తుల వీక్షించెను మారుతి యచటన్!
రావణాసురుని శ్రీ యెట్టిదియో రమ్య విలాసము లెట్టివియో!

పుష్పక విమానమును గపి జూచీ పులకితుడయ్యెను నొక క్షణమున్!
ఇట్టి వీరునికి యెట్టి బుద్ధియని యీసడించె తన మనసుననూ!
పరస్త్రీ చౌర్యము బాపమనుచు నీ పాతకునికి మది దెలియదుగా!
శ్రీ నశించు చిరకీర్తి నాశమై జెందును మరణము త్వరలోనన్!

ఇటుల దలచి యాపావని రావణు నింద్రభవనమును నడుగడుగున్!
సీతామాతను వెదకి కానకను మాతా! యెచ్చట నుంటివనీ!
సీత జాడ కనిపింపక మారుతి చిన్నబోయి తన మనసుననూ
పరిపరి విధముల నాలోచించెను భగ్న హృదయుడై దీనతనూ!

రావణు భవనము మధ్యనుండి మఱి రమ్యముగా బావని గాంచెన్!
భవ్య విమానము నాకసమందున దివ్యకాంతులను దీపింపన్!
విశ్వకర్మచే జేయబడినదియు విశ్వములో లేనట్టిదియున్
మణిరత్నములను రాజిలునట్టిది మహిమాన్వితమౌ నట్టిదియున్!

సుందరములు నగు చిత్రంబులతో సురుచిర కాంతుల నొప్పెడిదీ!
ఆకాశంబున నిల్చినట్టిదియును నతివేగంబున బోవునదీ!
స్వర్గమువలె సుఖదాయకమైనది సర్వవిలాస వికాస మనన్!
పుష్పక విమానమును జూచెను కపి పున్నమి చంద్రునిగా సింగిన్!

రావణ భవనము నందున నొక్కటి రమ్య సదనమును హరి జూచెన్!
జనక సుతను వెదుకంగ బోయెనట జేరి భవనమున నలుదెసలన్!
రాక్షసేంద్రుని యావాస మదీ రమణీయ సుఖా సదనమదీ!
నిశి రే యగుటను నిద్రను మునిగిరి నిఖిల రక్కసులు సదనమునన్!

రావణాసురుని శయన మందిరము రమణులతో సుఖముల దేలీ!
మధుపానముచే నిద్రమునింగెను మత్తగజమువలె నిద్రించెన్!
ఆసవధారలు గ్రోలి గ్రోలి యా యతివలు గూడను మైకముచే!
అచట చటను బడి నిదురబోయిరీ యతివలు చారు విలోచనలూ!

అతివ లందఱును సుందరాంగులే యద్భుత నయగుణ వర్తనులే!
రాక్షసాంగనలు దేవతాంగనలు రాజ కన్యలును గల రచటన్!
వలచివచ్చినా వారే యందఱు వన్నెల రావణు దిలకించీ!
భర్తయున్న దొక్కతెయును లేదట భార్యయైన దొక్కర్తుకయున్!

సీతను మాత్రము బలవంతముగా జేరి దెచ్చె నీ రావణుడూ!
చేటు దెచ్చుకొనె తనకు దానుగా శ్రీలన్నియు నిక నశియించున్!
మారుతి దలచుక మందభాగ్యునీ మదమణుగునులే యనుకొనుచున్!
అచట నచట నా సదనమునందున చట చట వెదుకను బోదొడగెన్!

పలవరించునది పైటజారినది భామల నచటను బొడగాంచెన్!
తనలో తానే మాటలాడుచును దన్మయమొందెడి దాని గనెన్!
ముద్దుగ మురళిని వొళ్ళు దెలియకను ముద్దిడు దానిని నట గాంచెన్!
వీణను గౌగిలి మోపి యదిమెడీ వెలదిని మారుతి యట జూచెన్!

చుక్కల మధ్యన చంద్రుడుండి తన సొగసులు జిందిన యట్టులగా!
అందగత్తెలా మధ్యన రాక్షసు దలరు శోభ హరి దిలకించెన్!
ఇదుండదు! ఇందుండదు జానకి! యిందిర మా సీతామాతా!
కనులు మూసికొని కదిలెను మారుతి కనరానీ దృశ్యములు గనీ!
రామ! రామ! శ్రీరామ రామ యని రమ్యభక్తి మనసున దలచీ!

రావణు శయ్యాగృహమున మారుతి రహి దిరుగుచు వెదుకుచు సీతన్!
భయ విహ్వాలుడయ్యెను క్షణమాత్రము శయనించిన రావణు గాంచి!
మహావీరుడని మహాబాహువని మదిని దలచె బవనాతజుడూ!
ఎందుల కీతడు పాపకర్మల జేయును గద యని చింతించెన్!

మదమువట్టినా మత్తగజముగా మారుతి రావణు గమనించెన్!
సకలాభరణములను ధరించినా సార్వభౌముని సొగసు గనెన్!
మదపానముచే మత్తిలి శోషిలి మదవతు లందున గూకుకొనీ!
తారల మధ్యమ జంద్రుని వోలెను దగ భాసించుట కనుగొనియెన్!

వింజామరలను వీచుకామినులు వీణల మీటెడి పూబోడుల్!
కిన్నెరలను మ్రోయించు లేమలును కీర్తన బాడెడి చంద్రముఖుల్!
నాట్యగత్తెలును నవరస భావాల్ నర్మముగా నొలికెడివారున్!
ఎవరికివారే మధుపానముచే నిలపైబడి నిదురించిరిగా!

పై వస్త్రము లవి యున్నవొ లేవో పన్నుగ తెలియదు వారలకూ!
ఏమి చేయుచున్నారో వారికి నింతయు దెలియదు స్పృహలేమిన్!
మధువుల గ్రోలీ మతులు జలించిన మాటలాడు యౌవనవతులన్!
విపరీతపు జేష్టలను జేసెడి విమలవతుల తీరును గనుచున్!

రావణాసురుని భోగవిలాసము రహి జూచుచు మారుతియంతన్!
చేటు కాలమది దాపురించుటది చెనటికి దెలియదుగా నయయో!
మధుపానము యామైకము భోగము మహి శాశ్వతమని దలచెనుగా!
సకల శాస్త్రములు జదివినగానీ సారమంటదుగ కొందఱికీ!

అని మారుతి వే వెదుకుచు వెదుకుచు యట నొక యున్నత శయమునన్!
నొక్క రూపవతి శయనించుట గని చక్కని సౌమ్యత దిలకించి!
ఈమె సీత యేమోయని దలచెను నించుక మదిలో శంకించెన్!
రావణు సతి మండోదరి దేవిని రమ్య! సౌమ్య పతిభక్తి రతిన్!

ఇటనుండదు నిటనుండదు! జానకి యెట్టి పరిస్థితిలో నైనన్!
అటు భావించుట మహాపాపమని యాత్మను నిగ్రహమున నుంచెన్!
సీత! మహాసతి! జనకుని కూతురు శ్రీలక్ష్మి యవతారముగా!
మదిలో దలచెను రామరామ యని మఱి యటనుండక తొలగి చనెన్!

రావణు శయ్యాగృహము వీడి హరి రయమున సీతను వెదకగనూ!
అచ్చటనే గల పానగృహమునకు ఆంజనేయు డంతట నేగెన్!
వివిధములగు మధువులతో నచ్చట విమల వాసనలు వెలువడుటన్!
పలురకముల జంతువుల మాంసములు పాత్రలయం దుండుట గనియెన్!

పానశాల యందంతట ధరణిని బన్నుగ పూవులు జల్లబడెన్!
ఆసనములు, మంచములు, శయ్యలును నమరియుండుటను గమనించెన్!
బంగరుపాత్రలు నిండియుండి యట పలురకముల యాసవములతో!
వెండిగిన్నెలట నిండియున్నవి వివిధ మాంసముల కూరలతో!

మదవతులగు స్త్రీలెందఱో యచట మైకముచే నట బడియుండి!
వికృతచేష్టలను జేయుచుండిరీ విలాసవతు లట నిద్దురలో!
చెరిగిన కాటుక కుంకుమ దీప్తులు చెదిరిన కురుల విలాసమునూ!
నేలనుబడి పొరలాడుచుండిడీ నీటుగత్తెలను గపి కాంచెన్!

మారుతి కొచ్చెను సందేహము మది మర్మముగా బ్రశ్నించుకొనెన్!
పరస్త్రీలను నిటు జూడవచ్చునా? పాపము గాదా? యని మదిలోన్!
ధర్మనాశనము నగును గదా యని తత్తరపాటున జింతించెన్!
మఱల నిట్లు జింతించెను బావని మధుర భావములు మొలకెత్తన్!

సీతను వెదుకుట కొచ్చితి నే నిటు స్త్రీలను జూడగ కాదుగదా!
అట్టి మనస్సును నదుపున నుంచితి యెట్టిభావములు లేవుగదా!
ఎట్టి వికారము బొందలేదుగద యెందులకీ చింతల్ వంతల్?
సర్వేంద్రియములను స్వారిజేయునది సర్వకారణము మనసు గదా!

అని మది దలంచి యతివ అందఱిని యల్లన మారుతి జూచుచునూ!
నాగ యక్ష గంధర్వ కాంతలను శయమ్ముగ వదకెను జానకినీ!
కానరాదు కల్యాణి! జానకి! కనకరేఖ! యా జనకసుతా!
మఱల వెదుకగను బూనుకొనెను హా! మహాభవనమున యడుగడుగున్!

రావణుభవనము మధ్య నిలిచి వే రాముసతిని గనుగొనదలచీ!
చిత్రశాలలను లతాగృహాలను జెన్నున వెదకెను బలుచోటుల్!
రాత్రిగృహాలను, నాట్యశాలలను రమ్య సదనముల దర్శించెన్!
కాని మారుతి కనలేదుగదా కనకరేఖ సీతా మాతన్!

ఎటుల జూతు సీతాదేవిని యని యిటుల మారుతియు దలపోసెన్!
ఈభూమిని గలదో లేదో మఱి యిహ జీవితమును జాలించీ!
రాక్షసబాధను దాళజాలకను రమణి సీత కడువేదననూ!
ప్రాణత్యాగమున కొడిగట్టినదో ప్రభు రాముని యాశల నొదలి!

సీతను జూడక యెటులజొత్తు నే జింతించెడి రాముని కడకున్?
ఎటుల జొత్తు సుగ్రీవుని కడకును నేమని బలుకుదు వివరముగా?
అంగదాదు లడిగెడి ప్రశ్నలకును నలరి యే విధము దెలిపెదనూ?
సీతను జూడక యెటులబొదు నే జింతల గూర్పగ నందఱకున్?

ఉపవసించి నే నమరుద నయ్యెద నపజయ మొందగలేను సుమా!
వార్ధి లంఘనము వ్యర్థమాయె నా పంతము వంతము లన్నియునూ!
పవనాత్మజు డిటు నిర్వేదమున బలుకుచు జింతిలె నొకక్షణమూ!
మఱలబొందె నుత్సాహము మారుతి మబ్బులు జెదిరిన విధముగనూ!

అతి యుత్సాహము ధైర్యములే కద! నఖిలార్థంబుల సాధనముల్!
నిరాశ నిస్పృహ దూరముజేసెద నిర్మలమతినై యుండెదనూ!
సీతనుగాంచీ! రాముని గూర్చి! చిరకీర్తిని సాధించెదనూ!
దుష్ట శిక్షణము జేసి యీ భువిని కష్టములను దొలగించెదనూ!

అని మారుతి యుత్సాహముతోడను నా రావణు భవనము నంతన్!
ప్రతియంగుళమును మఱల వెదికెనూ! ప్రమదల నందఱ మఱిజూచెన్!
చిత్ర శాలలను రత్న శాలలను జేరి నాట్యశాలల యందున్!
కాని మారుతికి గనరాదయ్యెను గనక రేఖ యా జనక సుతా!

వార్ధి లంఘనము వ్యర్ధమాయెనని వానర వీరుడు చింతించెన్!
ఎట్టుల సీతను బొడగనుటా యని భిట్టుగ మదిలో చింతించెన్!
గట్టిగ రాముని మదిని దలంచుచు పట్టుదలను వీడని మతితోన్!
రావణాసురుని రమ్య విభవమును రయముగ దగ బావని యంతన్!

రావణు సదనము లన్నియు పావని రయముగ వెదకెను జానకినీ!
చెఱువులు, వనములు, జలాశయములను జెలగుచు గొందులు దుర్గములున్!
లంకయుంతటిని వెదకెను గానీ రహి యగుపింపదు వైదేహీ!
చింతజేసె మారుతి యిట్లని నీ వంతను జేసెను మదియందున్

లంక నంతటిని వెదకితి గానీ కాంత జనకసుత యగుబడదే?
రావణు గృహమున జానకి గలదనె రహి సంపాతీ వచనములన్!
రక్కసు గృహముల నన్ని వెదికితిని చక్కని జానకి కనబడదే?
జీవముతో నున్నదొ లేదో యని చింతించెను బరిపరి విధముల్!

రావణు డెత్తుక వచ్చునప్పుడా రౌద్రభీకరుని గన్నులతో
చూడజాలకను సుదతి వైదేహి సుడులు దిరిగి మరణించినదో!
రామబాణమున వెఱచి రక్కసుడు రాము సతిని నీరధిలోనన్
పడవేసెనొ! మఱి జారిపడినదో! బ్రతికియున్న నగుబడదేమి?

హరించి రాక్షసు డంతరిక్షమున యా వైదేహిని గొనిపోవన్!
క్రింది సాగరము జూచి భయంపడి చెందినదో పంచత్వమునూ!
రావణాసురుని రక్కసి కాంతల రవరవలను భరియింపకనూ
జీవమొదిలినది యేమో నని కపి చింతిలె శోకము గ్రమ్ముకొనన్!

సీత లేదనుచు దెలిసిన రాముడు జీవము నొదులును విరహమునన్!
రాముడు ప్రాణము లొదులుట గాంచిన లక్ష్మణు డప్పుడు మృతిజెందున్!
వారి వార్త విని భరతుడు వేగము వరియించును మృత్యువు నీడన్!
శత్రుఘ్నుండును నంత మొందెడును నాత్రమునను భరతుడు వోవన్!

పుత్రులు వోవగ తల్లు లప్పుడు వే పొంగి పొరలి బహు దుఃఖమునన్
కౌసల్యా కైకా సుమిత్రలవి కావు కావు మని విలపించి!
ఆ సమింపెదరు నసువు లొదిలెదరు యడలుచు పుత్ర వియోగమునన్!
సీత లంకలో లేదని తెలిసిన జెలగును శోకము నంతటనూ
నేనే కారణమౌదుగదా! యీ నిఖిల మంతకును మూలమునూ!

శుభమును గూర్చిన రామచంద్రుని సుగ్రీవుం డపు డా వెంటన్!
రాముని మరణముజూచి ప్రాణములు రయమున నొదులును దుఃఖమునన్!
రుమ తారలు నంగదుడు గూడ నిక రోదనలను మరణింతురుగా!
రాజుండడు గపి లోకమంతయును రహిచెడి చిందర వందరగున్!

అంగద సుగ్రీవాదుల మరణము సంగతి విని కపి లోకమునూ!
ముష్టి ఘాతమున దలలు బాదుకుని మునిగి చచ్చెదరు గూపములన్!
అగ్ని జొచ్చెదరు నటునిటు జూడక కొండల బండల పైనెక్కి!
పడుచును దూకుచు ప్రాణము లొదులుచు బంచత్వంబును గాంతురిలన్!

జానకి లేదని కిష్కింధకు నే సరగున దెలుపగ బోయినచో
ఇక్ష్వాకుల నాశనమును మఱియును నిల వానర కుల నాశమునూ!
సమకూడును; నే సీతను జూడక జనరా దచటకు వేగమునన్!
సీతజాడ నే దెలియునంతకును జెలగి యుండెదను నీ లంకన్!

వానప్రస్థుడనై జీవించెద గనునంతకు సీతా మాతన్!
కందమూలములు భక్షించుచు నే నింద యుండెదను దాపసినై!
సీత జాడ నే దెలియునంతకును జెందను నిస్పృహ నింతయునూ
సీతా రాముల జతను గూర్చెదను! జిరకీర్తిని నే బొందెదనూ!

మరణింపగ దలచెను జావని వే మర్మముగా నగ్నులలో బడగన్
ఉపవాసములను గ్రహింప దలచెను ఉరుతర ప్రవాహముల బడిపోన్!
మనసు మార్చుకొని మారుతి యంతట మధుర ప్రాణములు నిల్పుకొనన్!
బ్రతికియున్న జానకి గనవచ్చును బంధువులను గనవచ్చుననీ!

అశోక వనమున వెదుకలేదు నే నందున వెదుకుదు జానకినీ!
మహావృక్ష సముదాయము తోడను మంజులమగు సుందర రుచులన్
రావణాసురుడు పెంచిన వన మిది రమ్య పుష్ప ఫల శోభితమున్
తప్పక యీ వనమందు సీత నే దప్పక జూతును గనులారన్!

## పావని సీతాదేవిని గాంచుట

అని మారుతి తన మనసును నిలిపి యజ రుద్రాదుల బ్రార్థించెన్!
సర్వదేవతల దగ బ్రార్థించెను స్వాంతమునందున దగ భక్తిన్!
నిర్మలమతితో రాముని దలచేను సమ్మతితో సీతను దలచెన్!
కార్యసిద్ధి తన కగునట్టులుగా గమ్మని దీవన నిమ్మనుచున్!

మారుతి విమాన భవనము నొదిలీ మహా ప్రాకారము పై దాటీ!
అశోకవనమును బ్రవేశించి యా యంద చందములను గమనించెన్!
సకల పుష్ప, ఫల శోభిత సుందర సకలాశ్చర్య కరం బనగన్!
నందనవన మన సుందర మొప్పెను జెందెను మారుతి విస్మయమున్!

కోకిల పాటలు జిలుకల పలుకులు కోమల మయూరి నృత్యములున్!
తూలి సోలి పూవుల రేకలపై వాలి పాడెడీ భ్రమరములున్!
సకల పక్షి సముదాయము తోడను జరించు మృగ సముదాయముతో
ఋషివాటిక యనిపించె మారుతికి ఋతువు వసంతముగా దలచెన్!

ఇట జూచెద నిట జూచెద జానకి నిశ్చయంబుగా మది యందున్!
తోచుచున్నవి శుభ శకునంబులు దొలకరి వానలు గురిసినటుల్!
కుడి కన్నదరుట కుడిభుజ మదురుట కోరిక సఫలము నగు నంచున్!
ఈ యశోకవనమే జానకిగా నిమ్ముగ మనసునకును దోచెన్!

కొమ్మ మమ్మనూ నెగురుచు మారుతి కూర్మి రాము సతి గాంచగనూ!
వనమంతయు నట బర్వులెత్తుచును వడి వడి దూకుచు గంతులిడెన్!
పక్షులన్నియును జెదిరెను నటు నిటు బన్నుగ లేచిన తాకిడికిన్!
పూవులన్నియును రాలి క్రిందపడె భూమికి పూజలు సేయునటుల్!

విశ్వకర్మ జేసిన భవనములను వివిధ జలాశయముల జూచెన్!
మణి భూముల కాంచన భూముల గని మదిలో విస్మయమును బొందెన్!
సుందరమగు నా యశోకవనమున యందములను బరికించుచునూ
నందనవనమే యనుకొనె మారుతి యెందులేని సొగసులు గనుచున్!

అట గనె మారుతి యొక పర్వతమును నలరెడి పూవుల తీగెలతో!
క్రిందికి జారెడి సెలయే ఱొక్కటి యందముగా బడుటయు జూచెన్!
దాపున గల దొక సరోవరమునూ దర్శించెను గపి వీరుండూ
అచటనె గలదొక యశోకవృక్షము యమృతపు గాలులు వీచుచునూ!

ఏ ఋషులో మునులో తపస్వినులో యే యోగులో నివసించెడిదీ!
పుణ్యభూమియని మారుతి మదిలో పులకించెను నానందముతో!
నిర్మలమగు నా ప్రశాంత భూమిని నిఖిలము మఱచెను దన్మయమై!
రామభక్తు డా ప్రభంజ తనయుడు! నా యశోక వృక్షము నెక్కెన్!

ఆ యశోకమున కొమ్మలచాటున యాంజనేయు డటు గూర్చుండీ!
మనసునందు నిట్లాలోచించెను మల్లెల దండను గూర్చినటున్!
అతి ప్రశాంత సుందర మీ వనమును అశోకవన మని యనవచ్చున్
బ్రతికియున్న జానకి యిటకొచ్చును బతిని దలచుకొని చింతింపన్!

తరు లతాదులన తరుణీ జానకికి దగని ప్రేమ యన నే వింటిన్!
మృగ పక్షుల నతి మోద మలరగను మేదినీ తనయ పెంచుననీ
మునిపత్నుల వలె నరుంధతికి వలె ముక్తికాంతవలె నుండగనూ!
కోరచుండెడిది యని నే వింటిని కూరిమి తాముడు దెలుపగనూ!

ఇట జూచెద యిట జూచెద సీతను ఇది నిశ్చయ మిది నిశ్చయమూ!
కుడి కన్నదురుట కుడిభుజ మదురుట కోరిక సఫలము నగు నంచున్!
తోచుచున్నవి శుభ శకునము లిల తొలకరి వానలు గురిసినటుల్!
మహిమాన్వితయగు మహాతపస్విని మాతను సీతను నే గాంతున్!

అని భావించుచు నాంజనేయు డా యశోక వనమున విహరించెన్!
రాముని సతి జనకాత్మజ గనుగొన రమ్యవనమునను దిరుగాడెన్!
కల్పలతలతో దివ్యగంధముల కలకల లాడెడి పక్షులతో
అశోకవన మధి నందనవనముగ యగుపించెను బావని కపుకున్!

వందలకొలది యశోక వృక్షముల యందచందములు బొడగాంచెన్!
పుష్పించిన యా యశోక తరువుల పులకిత సూర్యోదయ ప్రభలన్!
కాంతులు జిందుట కమనీయముగా వింతలు గూర్చగ మది యందున్!
అచట జూచె నొక ప్రాసాదమునూ అంబర చుంబిత మగు దానిన్!

ఆ ప్రాసాదము దాటి జూచె కపి యపురూపముగా నొక యువతిన్!
శుక్లపక్ష తొలి చంద్రలేఖగా శూన్య దృక్కులను బఱపుచునూ!
మలినాంబరమును ధరించి శుచియై మాటిమాటికిని మనసుననూ
రామ రామ యని పలవరించెడీ రమణిని పావని బొడగాంచెన్
కటిక నేలపై కూర్చుండినయా కమలనయన సీతను గాంచెన్!

రాక్షసాంగనలు జుట్టుజేరి యా రమణిని వేధించుచు నుండన్!
దీర్ఘమైన నిశ్వాసము లొదులుచు నిర్మలమతితో ధ్యానమునన్!
ఉపవాసములను గ్రహించి దేహము నున్న యువతి నట వీక్షించెన్!
జనకుని కూతురు రాముని సతి యని చారుశీలగా భావించెన్!

ఏకవేణితో నున్న జానకిని నింపుగ పావని గమనించెన్!
తపస్వినిని తరుణీమణి సీతను దన మనస్సునను బూజించెన్!
కంటినీరు దొలికెడి భూపుత్రికి కరుణామయుడై తలవంచెన్!
తన కన్నులలో నీరు నింపుకొని తగ ప్రణామమును గావించెన్!

అందమైన యీ జనకపుత్రి దగు నల రామునకును భార్యగనూ!
ఆ రాములు దగు జనకనందినికి యందమైన ప్రియ భర్తగనూ!
కాల మెవరికిని దాటరాదనుచు గనలిన మనసున జింతించెన్!
ఎట్టి కష్టములు వచ్చెననుచు దా కట్టిడి బ్రహ్మను నిందించెన్!

జనకుని కూతురు దశరథు కోడలు జగన్మాత యనగా నొప్పున్!
మహావీరుడగు రాముని సతికిని మహా పతివ్రత భూసుతకున్!
ఎట్టి కష్టములు వచ్చె ననుచు మఱి యిట్టి కన్నులను గన్నీటిన్!
మొరికెను జానకి వ్యథలను జూచి విలవిల మారుతి విలపించెన్!

రామ రామ యని మనసున దలచుచు రామ దర్శనము గోరుచునూ!
రాక్షసాంగనలతో యిడుమల బడు రమణిని సీతను బొడగాంచెన్!
జనకజ యని మది నిశ్చయించె కపి చరచర యశోక వృక్షమునన్!
కొమ్మల చాటున రెమ్మల మాటున నిమ్ముగ మారుతి దాగికొనెన్!

పక్షి సంపాతి పలికిన పలుకులు బన్నుగ నిజమాయెను నేడున్!
నీరధి దాటిన నా ప్రయత్నములు నిజముగ సార్థక మాయెనుగా!
కపులకు నే శుభవార్త దెలిపెదను గ్రమ్మర శ్రీ రఘురాములకున్!
అని మారుతి తన మనసున సంతస మందెను గుప్పలు గుప్పలుగా!

అశోక వృక్షమునుండి జానకిని యా మారుతి తిలకింపగనూ!
యత్నించెను దూరముగ నున్న యా యలరెడి శ్రీసతి వైదేహిన్!
కనుల జూచి సీతాదేవిని కపి కలవర మందెను దుఃఖమునన్!
మహాసతికి యిట్లేల దుఃఖమని మనసున మిక్కిలి దురపిల్లెన్!

మధుపానముచే మత్తిలి శోషిలి మన్నన యింతయు లేకయునూ!
వికృత రూపముల భయంకరముగా వికృత చేష్టలను జేయుచునూ!
ఖడ్గములను శూలములను జేగొని కఠిన పదములను బలుకుచునూ!
చుట్టునున్న యా రాక్షస వనితల కట్టడి రూపములను గాంచెన్!

జానకి చుట్టును యావరించి యా యసుర వనిత లందఱు జేరి!
కఠిన పదములను బలుకుట జూచుచు కఱిగెను మారుతి శోకమునా!
మలిన వస్త్రమున మలినకేశముల ధూళి నున్న ముత్యము వోలెన్!
రామ రామ యని పలికెడి సీతను రయమున మారుతి తిలకించెన్!

శారదాభ్రమున తెల్లని మబ్బుల చంద్రరేఖ భాసిల్లు విధిన్!
అశోక వనమున శోకసాగరపు నలలదేలు సీతను గాంచెన్!
పంకమునందున పద్మనాశముగ పడతి జనకసుత యగుపించెన్!
రాముని దర్శనమును వాంఛించెడి రమణిని మారుతి చౌదగాంచెన్!

కలువలు గుప్పలు పోసినట్టుగా గమ్మని రాత్రిని జంద్రుడునూ!
పైపై కొచ్చెను తెల్లని కాంతుల పందిరి మల్లెలు క్రిందవడన్!
చల్లని చల్లని గాలులు వీచెను చలనమందగా బూలతలూ!
బ్రహ్మరాక్షసుల వేద ఘోషముగా బలువిధములుగా వినబడియెన్!
సీతా దర్శన హర్ష యుక్తుడై చేరియుండె నట వృక్షమునా.

మనోహరంబగు మంగళ ధ్వనులట మఱిమఱి మ్రోగెను భవనములన్!
గాయక వైతాళికులందఱు నట గలిసి పాడిరీ గీతములన్!
నిద్ర మేల్కొనెను నిఖిల మదరగా నిండు గర్వములు దొలఁకాడన్!
రావణుడప్పుడు నిదుర మేల్కొనెను రయమున జానకి స్మృతికొచ్చెన్!

కలకల లాడే సరసులతో మఱి గలగల పలికే పక్షులతో!
సకల పుష్పఫల విరాజమానము చందన వృక్ష సుశోభితమౌ!
అశోకవనమున సీతను జూడగ యలరెడి యుత్సాహముతోడన్!
కామము జేతను గన్ను గానకను గదిలెను రావణు డపుడపుడే!

దాసదాసి పరివారము గదిలెను దరికొని రావణు వెనువెంటన్!
ముందు వెనుకలను వింజామరలను మంద మందముగ వీచుచునూ!
ఛత్రము బట్టెను సఖియ యొక్కతెయు స్వాత్రముతో నందఱు రాగన్!
దేవ నాగ కాంతలును వచ్చిరట దిశలు వెలుగ రక్కసు వెంటన్!

వచ్చిన రావణు వన్నెల చిన్నెల నచ్చముగా మారుతి గనియెన్!
పత్ర పుష్పముల చాటున నిలిచిన పావని యశోక వృక్షమునన్!
ఇప్పుడెకద నే జూచి వచ్చితిని యీ రక్కసు నా భవనమునన్!
అప్పుడె యిటు యిపు డెట్లు వచ్చెనని యా మారుతి మదిలో దలచెన్!

కాముకులకు సమయాసమయంబులు గనిపింపవుగా మైకమునన్!
చేటు కాలములు సమీపించు టది చెనటులు మది నూహింపరుగా!
భావికాలమును సమీక్ష సేయరు భాగ్యహీను లీ లోకమునా!
ఎండమావులకు నాశ బడియెదరు మండిపోదు రిల పాపములో!

వచ్చిన రావణు జూచి జనకసుత యొనరగ మోమటు ద్రిప్పుకొనీ!
యురమును గరముల చేత గప్పుకొని యుద్వేగంబున దీనతతో!
గాలి వేగమున నటునిటు కదిలే కదళీతరువుగ నొప్పుచునూ!
గంటినీరు ధారలుగా రాల్చుచు గలవరపడె మానసమందున్!

కటిక నేలపై కూర్చొని దీనగ కలకల విలపించెడి సాధ్విన్!
మలిన వస్త్రయై మలిన దేహమున మహా తపస్విని యనునటులన్!
ఏకవేణితో నుపవాసములను నేకాగ్రతతో దన పతినీ!
రామ రామ! యనుచున్న జానకిని రావణు డంతట చూడగాంచెన్!

మహా తపస్విని వోలె వెలుగు నామానిని సీతను రాముసతిన్!
రాముని రాకను రావణు వధనూ రహి వాంఛించెడి పరమ సతిన్!
కోపముచే శాపమ్మా కృతయ్యె మఱి పాపమనుచు మది దలపకమా!
చంపుదునని బెదిరించె జానకిని చంచలు డగు రావణు డంతన్!

రాక్షస వనితల మధ్య దీనయై రామరామ యని విలపించే!
జనకనందినిని జూచి రావణుడు సరసవాక్కులను నిట్లనియెన్!
ఓ ప్రియా! ఓ జనక నందినీ ఓ శుభగాత్రీ! చారుముఖీ!
నా వలపును నంగీకరింపుమా! నను జూడుము కనుసన్నలతో!

పరస్త్రీగమనము పాపము గాదది పరగ రాక్షసుల ధర్మమదే!
అందులకే నిన్నిటు గొనివచ్చితి యలరి జూచి నీ రూపమునూ!
అన్ని లోకముల జయించి వచ్చితి యడ్డులేరు నా కెవరైనా!
నా సర్వస్వము నీ కర్పించెద నను జూడుము జిలునగవులనూ!

కంటినీటితో కటికనేలపై కాలము గడుపుట న్యాయమంటే?
మలిన దేహమున మలినాంబరమున మదికుందుట యిటు సరసమటే?
పులకిత చందన పుష్పహారముల లలిత మధురిమల నొలికిస్తూ!
గీతవాద్య నర్తన కళలందున ప్రీతిజెంది రాణింపగదే!

నా భోగములన్నియు నీవేగా! నాజయ మంతయు నీదిగదే!
నా నవరత్నపు పేటిక లన్నియు నారాజ్యము సరస్వమునూ!
నీ కర్పించెద నిండు మనసుతో నీటుగత్తె నను జూడు దయన్
నాసతు లందఱు సేవజేయుదురు నయముగ నీయాజ్ఞకు నిలిచీ!

నదీ ప్రవాహము వోలె యౌవనము గదిలిపోవునే ప్రియురాలా!
నను ప్రేమింపుము! విశ్వసింపు నను నీదాసునిగా బడియుందున్!
నీ యాధీనముగా నొనర్చెదను నిఖిలైశ్వర్యము లన్నియునూ!
గీసిన గీతను దాటిపోను సుమ కిసలయగాత్రి యిదే మాటా!

నార చీరలను ధరించి రాముడు నాసరి జోడుగ రాగలడే!
వనముల లోపల దిరుగుచా దతడు వన్నెలు దరిగిన వాడతడే!
బ్రతికి యున్నవాడో లేదో మఱి పన్నుగ తెలియదు నెవ్వరికిన్!
ఇంతి! నన్ను జేబట్టి సుఖములను నింపుగ పొందవె కల్యాణీ!

అయస్కాంతముగ యాకర్షించెను నలరుబోడి! నీ యందములూ!
నీవుతప్ప నాకితర కాంత లలి నిలువరుగా నా కన్నులకూ!
మాసిన చీరను ధరించినా నీ మధుర రూపమే కనులందున్
అతికిపోయెనే హృదయమునా! సఖి! యలరిపోయెనే శిల్పముగా!

బంగరు కాంతుల పట్టువస్త్రముల బన్నుగ మేనున ధరియించీ!
కనక విమల మణిహార భూషణాల్ కంఠమునందున ధరియించీ!
వనవీథుల కొండలలో, లోయల వన్నెలుచిందే తీరములన్!
నన్నుగూడి విహరింపు స్వేచ్ఛగా నయగారములను జిందుచునూ!

మైథిలి! విను! నామాట సత్యమిది ధర్మముగా మఱి నమ్మికనూ!
నన్ను నీవు ప్రేమించుదాక నే నిన్ను స్పృశింపను వేగిరమున్!
అందులకే నీ ప్రేమ భిక్షకై యాక్రందించుట ఓ చెలియా!
శోకింపకు! నను మదన వేదనను సోలిపోవ జేయకుసఖియా!

రౌద్రమూర్తి రావణు వచనములను భద్ర! సౌమ్యగుణ! జనకసుతా!
మహాతపస్విని! మహాపతివ్రత! మానిని! భూమిసుతామాతా!
గడ్డిపోచ నొకదానిని గైకొని యడ్డముగా మధ్యనునుంచీ!
దీనభావమున సౌమ్య వచనముల ధీరత తోడుత నిట్లనియెన్.

మనసు మఱల్చుము! మధురప్రేమ నీ మానినులందున యుంపదగున్!
పతివ్రతల నిట గోరతగదు సుమ! ప్రజ్వలించు కాలాగ్ని శిఖల్!
బంధుమిత్రులను పత్నీ సుతులున్ను భస్మము జేసెడి నిముసమునన్
ధనధాన్యంబులు భాగ్యభోగములు రహి జెడు కీర్తి యశస్సులతోన్!

పతివ్రతను నే రాముని భార్యను బన్నుగ దశరథు గోడలునూ!
ఉన్నత వంశమునందు జనించిన ఉత్తమ శీలను గదవయ్యా!
అన్యుల భార్యల నపహరించుటయు యదియొక ఘనకార్యంబగునా?
శీలవతుల నిటు జెఱబట్టుట యది శ్రీలు దొలగి కులనాశంబౌ!

సాధుధర్మమును బరిశీలింపుము సజ్జన ధర్మములను గొనుమా!
సీధార్యుల నెటు రక్షింపుదువో! నిర్మలమతి యన్యుల సతులన్!
రక్షసేయవలె వినుము నిశాచర! రమ్య ధర్మముల నిలుపవలెన్!
చపలుకవై పరదారల గోరుచు జరింప దారుణ నరకంబౌ!

సజ్జన వాక్యము సాధుభావములు! సరసత మనసున గైకొనవో!
హితవాక్యంబుల నీసడించి యిటు జతగూడకు దుర్నీతులకున్!
నీచే లంకయు రాక్షసకులమును నిశ్చయముగ నాశంబగునూ!
దుష్టులైన రాజుల రాజ్యములిల కష్టములకు లోనగును గదా!

పాపకర్మునీ వినాశనమునకు బంచభూతములు హర్షించున్!
జాలి బొందబో రెవ్వరైననూ మాలిమి దయ జూపింపరుగా!
మంచి జరిగెనని హర్షింతురు ప్రజ యంచితముగ నీ వికనైనన్!
పాపబుద్ధులను మానివేగ నీప్రజ రక్షింపుము దయతోడన్!

నీ ధనాదులకు నీరాజ్యమునకు నీ మహదైశ్వర్యంబులకున్!
కోబడుదానను గాను గాను! నూ! లోకనాయకుని ఛాయనుగా!
జీవింపగ దలచిన రాములతో స్నేహ మొనర్పుము నణకువతోన్!
అర్పింపుము నను రామచంద్రులకు యంచితభక్తి సువినయమునన్!

అటుగాకను నీకగు బహుదోషము నలవిగాని యాపదలందున్!
అంతరించెదవు బంధుమిత్రులను నలరి రామబాణము జేతన్!
రామలక్ష్మణులు లేని సమయమున రహిచెడి నన్నిటు దెచ్చితివి!
దుష్కర్మమునకు దుష్ఫలితంబులు దోసంబులు మఱి దప్పవుగా!

రాఘవుతో యుద్ధము నమకూడిన రహిచెడి నేలను బడియెదవూ!
ఎందుదాగినను రామబాణములు సందు నిడవు నీయంగములన్!
ఇంద్రుడైన మఱి కుబేరుడైనను యెన్నగ కాపాడగలేరూ!
అగ్నిబడిన యొక కీటకంబువలె నంతరించెదవు నిజమునుమా!

ప్రియదర్శినియగు సీతవచనముల రయమున లంకాధీశ్వరుడూ!
వచ్చిన కోపము నణచుకొనుచు బహు మచ్చికతో నిటులను బలికెన్!
ఎంత ప్రీతిగా మాటాడిన నీ వంత కోపమును గనబఱచీ!
పరుష వచనముల మనసునొవ్వగా విరసముతో నొప్పించెదవూ!

నీపై నాగల కామభావమే నిను రక్షించుచు నున్నదిగా!
ఎట్టి పరుషములు బలికిన గూడను నిట్టె సహించుచు నుంటినిగా!
వధార్హవైనను వలపువలన నిను సదా గౌరవించుచునుంటిన్!
చాలు! చాలు! సహియింపబో నికను చారుముఖీ! యివె కడమాటల్!

రెండుమానములు గడువున్నది సుమ మెండుగ మనసును మార్చుకునీ!
రమ్యముగా నాశయనమందిరము రాణివిగావలె నో లలనా!
అటులగానిచో నీశరీరమును యణువులుగా ఛేదింపబడున్!
ప్రాతఃకాలపు ఫలహారంబున బడతి! నిన్ను నే భక్షింతున్!

రాక్షసేశ్వరుని బెదిరింపులు విని రక్కసికాంతలు బెదురువడన్!
దేవయక్ష గంధర్వకాంత లటి భీతిజెందిరట కన్నీటన్!
జనకసుతను నోదార్చి రండబును కనుసన్నలతో బెదవులతో!
అంత జనకసుత రాక్షసేశ్వరుడు భ్రాంతిజెంద యిటులను బలికెన్!

దేవేంద్రునకును శచీదేవివలె దేవేరిని నే రాఘవుకున్!
తగని వాక్యముల బలికినందులకు దగిన దండనను బొందెదవూ!
అతనికంటె బడనంతవంటకు సుమ! యా బల గర్వము దర్పములూ!
మదమాతంగము బోలు రాముచే మడిసెద వింకను రణమందున్!

ఇటుల నన్ను నిందించెడి నాలుక యేల ధరణిపై పడిపోదో?
అనార్యుడా! నను జూచు గన్నులటి యదిరి యూడిపడి పోవేలన్!
రామలక్ష్మణులు లేని సమయమున రయమున దొంగిలి దెచ్చితివీ!
పరస్త్రీ చౌర్యము పాపముగాదా? పన్నుగ నీవొక ధీరుడవా?

పాతివ్రత్య తేజముచే రావణ! భస్మము జేయుట లేదుసుమా!
రామునాజ్ఞ లేకుండుటచే మఱి విమల తపోవ్రత పాలనచేన్!
రామబాణమున వధింపబడుదువు వ్రాసెను బ్రహ్మ లలాటమునన్!
శీలవతుల జెఱబట్టిన నీచుల చెడును రాజ్య ధన భోగములున్!

ఆ మాటలు విని రాక్షసేశ్వరుడు యారని చిచ్చుగ మండిపడీ!
ఓ సీతా! ని న్నిపుడె వధించెద నోర్వజాల నీ మాటలకున్!
సూర్యుడు సంజల దన తేజస్సున హరించినటువలె నిక నిన్నున్!
హరించి వైచద ననుచు బలికి యా రాక్షస కాంతల బొలికేకన్!

ఏకాక్షీ! గోకర్ణి! సింహముఖి! యిక మీరందఱు బూనుకొనీ!
సామ దాన భేదముల సీత నిక సరగున దొంపుడు దండనలన్!
అని క్రోధముతో నసిశపాతముగ యా సీతను గని గర్జించెన్!
కనుల నుండి క్రోధాగ్నులు గురియగ కలికి జనకసుత యదిరి పడన్!

అంత ధాన్య మాలిని యను రక్కసి సుంత ధైర్యమును వహియించీ!
రాక్షసేశ్వరుని గౌగిలించుకొని రంగుమీర యిటులను బలికెన్!
మహారాజ! నాతో క్రీడింపుము మధుర భోగముల దేలింతున్!
మానవ కాంతను గోరనేల యది దీన హీన శోకాతురయున్!

ప్రేమింపని యువతిని కాంక్షించిన ప్రేమికునికి యగు తాపంబున్!
ప్రేమించిన యువతిని కామించిన ప్రీతి గలుగు నానందంబున్!
అనుచు బలికి యా ధాన్య మాలినియు యా లంకేశ్వరు దోడుకొనీ!
అంతఃపుర భవనంబునకై వడి యరిగె చెలులు రా వెనువెంటన్!

అంతఃపురమున కేగ రావణుడు నంతట రాక్షస కాంత లిటన్!
నలువైపులనూ జుట్టుముట్టి వే శీలవతిని యా జనక సుతన్!
లంకేశ్వరునకు భార్యవు గమ్మని లంకకు రాణివి కమ్మనుచున్!
పరుష వాక్యములు బలుకగ నాగిరి పలు విధములుగను వ్యంగ్యముగన్!

పులస్త్య వంశమునందు బుట్టినా పురుషోత్తముడే రావణుడూ!
అట్టి ఘనుని జే పట్టవేలనే యలరుబోడి విను నా మాటన్!
సర్వ భోగములు త్యజించి నీకయి తహ తహ లాడెడి ప్రభుగనుమా!
అడవుల దిరిగెడి రాముడేలనే హంసగమన! నా మాట వినూ!
అనుచు బల్కె నొక యసుర కాంత విహా వినయముగా సీతను జూచీ!

ఏక జట యను నొక బిర్రక్కసి నిటుల బల్కె సీతను గాంచీ!
ప్రజాపతులలో నాల్గవ వాడుగ ప్రసిద్ధి జెందెను పులస్త్యుడున్!
అతని కుమారుడు విశ్వావసు సుమ యతని కుమారుడు రావణుడూ!
అట్టి రాక్షసేశ్వరుని భార్యవుగా నందుకొనుము సౌభాగ్యములన్!

హరిజట యను నొక రక్కసి బల్కెను యలరి జానకిని బొడగాంచీ!
దేవరాజు నపి జయించినాడే! దివిజులందరును బానిసలే!
అట్టి విభుని నీవేల కాదనెదు వంధురాలవే జనకసుతా!
మనసు మార్చుకొను! నాలోచింపుము! మధుర భోగముల చవి గొనుమా!

సూర్య చంద్రులును నగ్ని వాయువులు సురుచిర సుందర ప్రకృతియునూ
రావణు నాజ్ఞను నడుచు సర్వమును రమ్య వనస్పతులును గూడనీ!
హాలతి! వినుము నా మాట నయముగా బొందుము సర్వోన్నత సుఖముల్!
అటుల కాదనిన మనజాలవు నిట మణిగిపోయెదవు నిడుములలోన్!

వికృతాననలగు రాక్షసాంగనలు విమలశీల సీతను గాంచీ!
పరుష వాక్యములు బలు విధములుగా బలుకగ సాగిరి యప్రియముల్!
సర్వ మనోహర మది ఓ సీతా! సర్వ సుఖములకు నిలయమదీ!
రావణు నంతఃపురమునంది వే రమ్య సౌఖ్యముల రుచి గొనుమా!

రామునిపై గల మనసు ద్రిప్పుకొను రాజ్యభ్రష్టు డత డడవులలో!
కొండల కోనల దిరుగుచున్న వా డెండల వానల దడియుచునూ!
దండి రావణుని స్వీకరించి యు ద్దండత నేలు త్రిలోకములన్!
మూడు లోకముల సంపద లన్నియు ముచ్చటగా నవి నీవె సుమా!

రాక్షసాంగనల యప్రియముల విని రమణి సీత సద్గుణ లలితా!
అశ్రుపూర్ణ వాక్యముల నిట్లనియె నల్లన రాక్షస కాంతలతో!
లోక విరుద్ధములగు మీ పలుకుల లోలత జెందను నింతయునూ!
పాప పూర్ణమగు బలుకులు బలుకక పన్నుగ నను వేధింపకుడూ!

మానవ స్త్రీ యెటు మహా రాక్షసుని మధురముగా బతిగా నెంచున్?
నన్ను మీర లందఱును దినినను మిన్ను విఱిగి పడిపోయిననూ!
రాముడు నా పతి రాముడు నా గతి రాముని సతి నే రాము గతిన్!
కాంతి సూర్యునీ కలిసియుండినటు గలిసియుండెదము శాశ్వతమున్!

శచీదేవి దేవేంద్రుల వలెనూ శశి రోహిణి దాంపత్య గతిన్!
అల యరుంధతీ వసిష్ఠులకు వలె యలరి యుండెదము నెల్లపుడున్!
ఆ పలుకుల విని రాక్షసాంగనలు యఱచుచు పెను కేకల తోడన్!
పరుష వాక్యముల దగ బెదిరించిరి పన్నుగ సతి సీతా మాతన్!

పెదవులు గదుపుచు నాల్కలు దెఱచుచు గదుపుచు కరముల శూలములన్!
నిను జంపెద మిపుడే మ్రింగెద మిదె నిలు నిలు మంచును బెదిరింపన్!
అశ్రుపూర్ణ నయనముల జనకసుత యడలుచు వేదన జెందుచునూ!
అశోక వృక్షము కడ కేతెంచెను అమల శీల పతిశీల వ్రతా!

అశోక వృక్షపు పత్ర పుష్పముల యణగియుండి పవనాత్మజుడూ!
రావణాసురుని పరుష వాక్యములు రౌద్ర భీకరాకారమునూ
రక్కసి కాంతల పరిభాషణముల రమణి జనక సుత వేదనలన్!
కొమ్మల రెమ్మల చాటునుండి తా నిమ్ముగ జూచెను మౌనముగా!

రాక్షసాంగనల పరుష భాషణల రమణి సీత వేదనతోడన్!
కంటికి మంటికి యేకధారగా కలకల మనుచును రోదించెన్!
అశోక వృక్షపు కొమ్మ బట్టుకొని హా రామా! లక్ష్మణ! యనుచున్!
హా కౌసల్యా! హా సుమిత్ర! యని యడలుచు బోరున విలపించెన్!

భర్తను దలచీ పరిపరి విధముల బాధల నన్నిటి దలచుకొనీ!
ఎట్టి కష్టములు జుట్టుముట్టెనని గట్టిగ జానకి శోకించెన్!
ఏ జన్మంబున జేసిన పాపమొ! యీ జన్మంబున యీ రీతిన్!
కష్టములలో బడి క్రుంగుచుంటినని యింతి జనకసుత చింతించెన్!

ఈ జన్మంబున యినకులేశుని యీ కన్నులతో గాంచుదునా?
రాముడు లేకను బ్రదుకుచుంటి నిల రాతిగుండె కాదా నాది?
చల్లని మృత్యువ! దేవుపైన నే నల్లన శాంతిని జే కొందున్!
మహాశోక పరివృతనై నేనిక మనజాలను నొక క్షణమైనా!

అనుచు జనక సుత యశ్రుపూర్ణమై! యా రాక్షస కాంతల మధ్యన్!
కంటినీరు జల జల మని పొఱగ చంటిపాపలా ఘోరమనీ!
విలపించెను విలపించి జనక సుత విస్మృతి నొందిన గత గాథల్!
మదికి దెచ్చుకొని యొక్క టొకటిగా మఱి మఱి జానకి శోకించెన్!

కామ రూపియగు రావణాసురుడు కపట లేక బలవంతముగా!
రామ లక్ష్మణులు లేని సమయమున రయమున నన్నిటు గొనివచ్చెన్!
దానవాంగనల దారుణ చేష్టలు ధర్మ విదూరపు వాక్యములున్!
జీవింపగ నా కాశలేదు సుమ! చిరకాలము గనుచును వినుచున్!

నాథుడు లేనీ నాదు జీవితము నయముగ వ్యర్థంబని దలతున్!
ఇన్ని దినము లిటు బ్రతికియుంటినీ పన్నుగ రాముని జూడకనూ!
రాతిగుండె కావుననే పగులక యతి భద్రముగా నుండె నిదీ!
అశ్మ సారమిది లోహ నిర్మితము నజరామరమని యనుకొందున్!

వామపాదమున నైన స్పృశింపను కామ రూపుడగు రావణునీ!
చీల్చివేసినను ఖండ ఖండములు కాల్చి భస్మమును జేసిననూ!
సుప్రసన్న శుభమూర్తి! సుగుణ ఖని! సుందర రూపుడు రామ విభున్!
వేఱుబడితి నిటు విధి విలాసమును యెఱుగరుగా యెవరైన నిలన్!

దండక వనమున ఖర దూషణులను ఖండించిన రఘు వీరుండూ!
దండి రక్కసుల పీచమడచినా నిండు బాహుబల వీర్యుండూ!
రాముడిటకు మఱి యేల రాడొకో! రావణు నేల వధింపడొకో!
సతినగు నా చెఱ తొలగిజేసి వే యతి ప్రేమను లాలింపడొకో!

ఇటు నే లంకను నున్నది తెలిసిన చటుల గతిని శ్రీరాఘవుడూ!
వార్ధి దాటి రావణుని వధింపును వరుసను రాక్షసు లందఱినీ!
ఖరిమూర్చును లంకంతయు మారును పన్నుగ శ్మశాన వాటికగనూ!
శ్రీలు దొలగు శుభ దృష్టి నశించును చెన్నుగ లంకా ద్వీపమునన్!

జానకి మరణించినదని దలచెనొ? మానుగ నా పతి మనసుననూ!
నా విరహముచే నసువుల నొడిలెనొ నవ్యనీల ఘనశ్యాముండూ!
జటాయువైనను బ్రతికి యుండినను జాడను దెలిపెడి వాడేమో!
నేనిట నుండిన వార్త దెలియునో నిర్మలుడగు శ్రీరాములకూ!

గడువు కాలమది సమాప్తమగు నిక గ్రక్కున కొలంది దినములలోన్!
నరభక్షకులగు రాక్షసు లప్పుడు నను భక్షింతురు నిక్కముగా!
ధర్మాధర్మము యుక్తాయుక్తము ధార్మిక గుణముల నెఱుగరుగా!
ముందు వెనుకలను నాలోచింపరు మునిమతంబులను నెఱుగరుగా!
ఇట్టి కష్టముల బడుటకన్న నే యిష్టముగా నా ప్రాణములన్!
వదులుట యుక్తంబని దలంచెదను బదముల నా పతి దలచుచునూ!

రాక్షస స్త్రీలను నుద్దేశించుచు రమణి సీత యిటులను బలికెన్!
రామలక్ష్మణులు రాగలవారలు రావణాసురుడు హతమగునూ!
రక్కసిమూకలు హతమై లంకకు పిక్కటిలును పెను నాపదలూ!
శ్రీలు దొలగు లంకాద్వీపమునకు జెలరేగును నార్తధ్వనులున్!

సీత పలుకులను విని వే వేగము చెలగి రావణుని దరిజేరి!
వినిపించిరి రాక్షస కాంతలటుల వేగమె సీతను జేరుకొనీ!
పరుషవాక్యములు బలునిధములుగా బలుక సాగిరట జనకసుతన్!
పలుకుట విని త్రిజటా యను రక్కసి పలికెను నీ విధి మేల్కాంచీ!

జనకుని కూతురు దశరథుకోడలు జానకి పరమ వినీత సుమా!
అప్రియముల నిక బలుకబోకుడీ సుప్రియంబులగు మీ కెపుడున్!
అమ్మలార! నే నొక కల గంటిని యాశ్చర్యము వైచిత్రమునూ!
రాముని విజయము రావణు మరణము రయముగ యగునని బొడగంటిన్!

గజదంతంబుల నిర్మించినదీ ఘనమగు నొక్క విమానమునన్!
వేయి గుఱ్ఱములు బూన్చి నట్టిదియు వేగముగా నాకాశమునన్!
రామలక్ష్మణులు రయమున వచ్చుట రమణులార! నే గంటిగదే!
శ్వేత వస్త్రమై జానకి రాముని జేరవచ్చుటది గాంచితి నే!

తెల్లని వస్త్రములను ధరించి మఱి తెల్లని పూవుల దండలతో!
నాల్గు దంతముల యైరావతమును రామలక్ష్మణులు సీతయునూ!
ఉత్తరదిశగా దరలి పోవుటను నొప్పుగ జూచితి జెలులారా!
లంకనంత భూతములు దిరుగుటను బొంకముగా నే జూచితినీ!

ముందన మత్తుడైన రావణుడు నందలేక వే రెవ్వరునూ!
పుష్పకంబుపై నుండి జారిపడి బోరగిలను దరణిని బడియెన్!
గన్నేరు పూవుల మాలను దాల్చి కల్లు ద్రావుచును మత్తుండై!
గార్ధభంబుపై రావణాసురుడు కాంతలార కనిపించె సుమా!

గార్ధభంబుపై నెక్కి రావణుడు కదులుట దక్షిణ దిక్కునకూ!
ఒంటె నెక్కియటు కుంభకర్ణుడూ యొనరగ దక్షిణ దిక్కునకూ!
మహావీరుడగు నింద్రజితునూ మఱి మఱి రాక్షస వీరులునూ!
దక్షిణ దిక్కుకు దరలిపోవుటను తరుణులార! కలగాంచితినీ!

లంకా ద్వీపము దగులబడుటమును రమ్యభవనములు గూలుటయున్!
భూతప్రేతములు దిరుగులాడుటయును భువియంతయు బ్రద్దలు నగుటన్!
విభీషణుం డొకరుండు మాత్ర మట నొప్పగ తెల్లని ఛత్రముతో!
ఆకాశంబున నలరుట జూచితి అమ్మలార! యిది నిజమమ్మా!

ఈ స్వప్నంబున నే దెలిసితినీ! ఇన వంశోత్తము విజయమునూ!
రావణు మరణము జరుగనున్నదని! రాక్షస నాశము జరుగుననీ!
ఇంక మీర లిటు యాగడంబునను నీ సీతను వేధింపకుడీ!
క్షమింపుమని యాచింపు డందఱును నమిత వినయమున జానకినీ!

కలవిని రాక్షస కాంత లందఱుసు గలవర మందుచు భయపడుచున్!
క్షమాభిక్ష నటువేడు దరందఱును జాగుసేయకను వనువెంటన్!
అంత జనకసుత యానందముతో నసుర కాంతలకు నిట్లనియెన్!
కల నిజమైనను కాంతలార! నే గాపాడుదు మిము క్షేమమునన్!

రాక్షసేంద్రుదు దుర్వచనములను విని రమణి జనకసుత భయమందెన్!
సింహముచే నల చుట్టు ముట్టబడి చింతిలు నేనుగు గున్నవలెన్!
కాంతారము మధ్యమున వదిలినా కన్యకు వలె నతి భీతిలుచున్!
శోకముచే విలపింప సాగెనట శూరుని రాముని దలచుకునీ!

అకాల మృత్యువు రాదని పెద్దలు ననెడి మాట నిజమగు గాదా?
ఇన్ని విధములను బెదిరించిననూ నింకను నే నిల జీవముతో!
బ్రతికి యుంటినీ బ్రద్దలవదుగా బంధురమగు నా పెనుహృదయం!
వజ్రాహతమగు పర్వతంబుగా వ్రక్కలు వేలుగ గాకుండన్?

శస్త్రము జేతను విషము జేతనూ జెందెద మరణము నతి త్వరలో!
శస్త్రము, విషముల నిచ్చెడివారలు జెన్నుగ నిచ్చట లేరుగదా!
అని విలపించుచు నా జానకి సతి యలరు జడను దన కంఠమునన్!
ఉరిని బోసికొని యమసదనమునకు నరిగెదనని మది భావించెన్!

రెండు నెలలు గడువుండె మాత్రమని ఖండితమగునని నా తనువున్!
రావణాసురుడు బలికె నిప్పుడిట రమణులెసుందర నిశ్చయమున్!
ఎఱుగడుగా శ్రీరామచంద్రుడట! యేమి కావలెనొ యిక పీదన్!
సదాచార నియమములు సత్క్రియలు సత్పుణ్యము, సద్ధర్మములున్!
నిష్ఫలమాయె నటంచు జనకసుత నిండు హృదయమున విలపించెన్!

హోరామా! హా లక్ష్మణ! యంచును హా! కౌసల్యా! యనియంచున్!
ఆ యశోక తరుశాఖ పట్టుకొని యలసి నిలిచినా జానకికిన్!
శుభశకునము లవి కానిపించినవి సుందరంబులగు నాకృతులన్!
మనసున పూవులు బూచినట్టులె మధురిమ లేవో బులకించెన్!

శ్రీగలవానిని జేరవచ్చినటు సేవకులందఱు జానకికిన్!
శుభశకునము లవి యొకటి యొకటిగా సురుచిరమున నట భాసించెన్!
వామ నేత్రమును. వామ భుజంబును వరుసతోని నదురుట గనియెన్!
కట్టిన వస్త్రము జారె స్వల్పముగ కమ్మని గాలుల తాకిడికిన్!

తనపతి రాముడు నెదుట నిలిచినటు తనదు వామ యూరువు వేగన్!
అదిరినటుల జానకి కనుపించెను నందములగు శుభశకునంబుల్!
ఎండకు, గాలికి వాడి వత్తలె ఎండిపోయినా విత్తనమూ!
వర్షము చేతను బలకరించినటు వన్నెల జిందెను జనకసుతా!
శుక్లపక్షమున చంద్రరేఖవలె సౌంష్ఠవ నొలికెను భూమిసుతా!

రాహువు వక్త్రమునుండి వెలువడిన రమ్యమైన చంద్రునివోలెన్!
అలల సుడుల తాకిడికి బయటపడి యలరు ఓడ పయనించినటుల్!
శుభశకునములను తేజరిల్లినా శోభన కాంతుల జనకసుతా!
కడిగిన ముత్తెపు దండవోలె మఱి కనకరేఖవలె భాసించెన్!

అంతట పావని గాంచె నంతయును నశోకవృక్షపు పైనుండి!
రావణాసురుని రౌద్రపు బల్కులు రాక్షసాంగనల బెదిరింపుల్!
జానకి వేదన త్రిజటా స్వప్నము కని విని పరితాపము జెందెన్!
జనకసుతను నోదార్పగ దలచెను వినయ వినీత సువాక్యములన్!

వేలు లక్షలుగ వానరవీరులు వెదికెడి సీతను బొడగంటిన్!
గుప్తరూపమున యున్నదంతయును గూఢచారిగా గనుగొంటిన్!
లంకేశ్వరుని లావుదర్పములు లంకా నగరిని బొడగంటిన్!
పతి దర్శన కాంక్షిణియగు సీతను బన్నుగ యోదార్చెద నిపుడున్!

రక్షసేయు వారింక లేరనుచు రమణి సీత తన ప్రాణములన్!
వదిలిన యంతకు ముప్పు వచ్చు నిక చెదురును సర్వము మూలముగన్!
శ్రీరాముల సుగ్రీవ కార్యములు చెడి ప్రమాదమున బడిపోవున్!
శోకమూర్తియగు సీతాదేవిని సురుచిర పదముల నోదార్తున్!

జనక సుతను నోదార్పబోక నే చరచర నేగిన రాఘవులా!
సీత యేమనిన దని పలికిన నే జెలగి పలుకుదును నేమనుచున్!
ఎట్టి విధంబున వీలు జూచుకొని యీ రాత్రియె సీతామాతన్!
రాముని సందేశమును దెలిపి నే రయమున కిష్కింధకు బోదున్!

కమ్మని సంస్కృత వాక్యంబులతో నిమ్ముగ నే బలికిన వెంటన్!
కామరూపుడగు రావణు డనుచును గలికి సీత కేకలు వేయున్!
రాక్షస వీరులు జుట్టు ముట్టెదుర రయముగ కార్యము భంగమగున్!
గుట్టుగ యీపని చేయవలయు సుమ రట్టులేక యనుమంతయునూ!

రామచంద్రుని రమ్య గాథలను రమణీయముగా వినిపింతున్!
మధురములగు నా పలుకుల తోడను సుధలు జిందు ప్రత్యుత్తరము!
వొసగుచు జానకి నమ్మునట్లు నను నొనర జేతునని భావించీ!
అశోక వృక్షమునుండి పవనసుతు డల్లన బలికెను మధురముగా!

## పావని సీతాదేవికి శ్రీరామచంద్రుని సందేశమును దెలుపుట

ఇక్ష్వాకుల వంశమున జనించెను ఇంపుగ దశరథుడను ప్రభువూ!
పుణ్య శీలుడును, పురుషోత్తముడును పుడమి జనుల కల్పక మతడూ!
సత్యసంధుడును, సహజ విక్రముడు సజ్జన శ్రేయోదాయకుడున్!
ధర్మము నాలుగు పాదములందగ ధరణిని పాలించెడి వాడున్!

అట్టి దశరథునికి జ్యేష్ఠ పుత్రుడును నలరు రామచంద్రుం డతడూ!
ఆశ్రిత రక్షకు డనంత విక్రము డస్త్ర శస్త్ర సంధానమునన్!
ఎదురులేని యా మేటి వీరుడీ మేదిని రక్షకు డనబోలున్!
ధర్మరక్షణకు దిగివచ్చిన యా ధర్మదేవతయె యనవచ్చున్!

తండ్రియాజ్ఞ నెఱవేర్చుట కొఱకయి తన భార్యను సీతనుగూడి!
అనుజుడైన లక్ష్మణుతో గూడుక యుఅరి వనములకు నేతెంచెన్!
కామరూపులగు రాక్షసవీరుల కాలరాచె తన బాణములన్!
ఖర దూషణులను ఘోర రాక్షసుల ఖండ ఖండములుగా జేసెన్!

దండకవన మది శూన్యమగుటచే దానవనాథుడు రావణుడూ!
మాయమృగ కల్పనచే రాముని మాయచేసి బహు దూరముగా!
జేరనటులుగా జేసి జానకిని జెఱబట్టెను బహు క్రూరముగా!
రాముడు సీతను వెదుకుచు వెదుకుచు రయముగ కిష్కింధకువచ్చెన్!

సుగ్రీవునితో స్నేహ మేర్పడియె సురుచిరముగ వారిరువురికిన్!
వాలి నొక్క కోలను బడవేసెను లాలితముగ సుగ్రీవునికిన్!
పట్టము గట్టి, రాజ్య మొసంగెను బంధురమగు సుస్నేహమునన్!
వానర కోటికి రాజుగ వెలసెను నొనరగ సుగ్రీవుం డపుడూ!

అతని యాజ్ఞచే వానరసేనలు నన్ని దిక్కులకు బయనించెన్!
సీతను వెదుకగ బయలు దేరిరి చెన్నుగ వనములు కొండలునూ!
జటాయు సోదరు పలుకుల నే విని శత యోజనములు బయనించి!
నీరధి దాటితి! నిన్ను జూచితిని! నిర్మల మతి హే జనకసుతా!

ఆ మాటలు విని జనకనందిని యాత్రముతోడుత ముదమునను!
రామరామ యని మదిని దలంచుచు మర్మముగా నటు నిటు జూచెన్!
ఉదయభాను కిరణంబుల్కకునువలె నొప్పుగ విరియుట గమనించెన్!
అశోక వృక్షపు గుబురుల యందున యాంజనేయులను బొడగాంచెన్!

అశోక వృక్షపు కొమ్మల చాటున యణగియున్న పవనాత్మజుని!
చిత్రమైన యా రూపము గనుగొని చింతిలె నిట్టుల జనకసుతా!
వానర రూపము నున్న ఈ మృగము వలనుగాదు, జూడగజాలన్!
భయంకరముగా నున్నదనుచు దా భయమోహితయై మూర్ఛిల్లెన్!

అంత దేరుకొని రామరామయని యశ్రువులొలుకుచు జనకసుతా!
వినయము దోడుత దగ్గఱ కొచ్చిన వానర ప్రముఖుని గనుగొనుచున్!
కల గనుచుంటిని యని మది దలచుచు గలతనొంది తన మనసునమా!
కలగా దిది నిజమని మది దలచెను కరుణామయి సీతామాతా!

సదారామ యను ధ్యానమనస్కును సదా రామ యను చింతనమే!
సుఖమెచ్చటి? మఱి నిదురయెచ్చటిది? చూడగ స్వప్నం బెచ్చటిదీ?
ప్రతి క్షణమును నాతని చింతనమే యతని ధ్యానమె యెల్లపుడున్!
అతని రూపమును గన్నుల గనుచును నతని కథలనే వినుచుంటిన్!

స్పష్టమైన రూపముతో గనపడి స్పష్టరీతి బలుకుట తోడన్!
సువ్యక్తముగా మాటలాడి నను సుధామాధురిని ముంచెనుగా!
అనుచు దలచి వైదేహి వసువులను నజ రుద్రాదుల ప్రార్థించెన్!
వానర వీరుడు బలికిన దంతయు వచన నిజమగుత! యనుచు మదిన్!

అశోక వృక్షము నుండి దిగిన యా యాంజనేయు డతి వినయముతో!
భక్తిభావమున మోకరిల్లి తా చిత్రమౌర యంజలితోడన్!
మధుర వాక్యముల బలికె నిట్టులను మారుతాత్మజుడు జానకితోన్!
"అమ్మా! యెవ్వరు నీవు? తెలుపుమా! యశ్రువు లొలికెదు వెందులకూ?

దేవాసుర గంధర్వ కాంతవో! దేవతవో! మఱి కిన్నెరవో!
రోహిణివో? మఱి వశిష్ఠు భార్యవొ! రూఢిగ దెలుపుము నీ చరితన్!
ఎవరికోస మిటు శోకము జెందెదు? వెందుల కీ సంతాపంబున్?
రామరామ యనుచున్న నీవు రఘురాముని సతివో! యెవ్వరవో?

పావని పలుకులు విని జనకాత్మజ పలికె నిట్టులను మోదముతో!
దశరథు కోడల! జనకాత్మజనూ! విశదముగను రాముని భార్యన్!
సీత యనుచు నను బిలుతురు భువినీ చెఱలో నుంటిని రావణునీ!
నాదు పతిని నే జేరగ కోరిక నయముగ వినుమా! కపివీరా!

దండకవనమున వాసముండగను దండి రక్కసుడు రావణుడూ!
రామలక్ష్మణులు లేని సమయమున రయముగ నను బలంతముగన్!
దొంగిలించి తెచ్చెను నీ లంకకు దోస మనుచు మది దలపకనూ!
నాదువేదనకు గారణ మిది సుమ! నయముగ వినుమా! హరివీరా!

తండ్రి యాజ్ఞ బాలింప వనములకు తనయుడు రాముడు వెడలగనూ!
పతియె దైవమని భావనజేసెడి సతిని నేను నా యడవులకున్!
బయలుదేరితిని రాముని వెంటను బయలుదేరె నిక యనుజుడునూ!
లక్ష్మణదేవర కూడ వచ్చె నా భీష్మమైన కాఱడవులకున్!

దుఃఖిత యగు సీతాదేవిని గని దుఃఖితుడై పవనాత్మజుడున్!
ఆర్ద్రవచనముల బలికె నిట్టులను నాత్మీయత వెల్లుబకగనూ!
అమ్మా! నే శ్రీరాముని దూతను ఆంజనేయుడను వినుమమ్మా!
రాముని సందేశమును దెచ్చితిని రమ్యశీల! గుణ! జనకసుతా!

ఎవరికి బ్రహ్మాస్త్ర ప్రయోగమును యెవరికి దెలియునో వేదములున్!
అట్టి రామవిభు డంపెను నను విను! గట్టిగ శ్రీరాముని బంటన్!
నీదు క్షేమమును దెలిసి రమ్మనుచు నీ విభుడంపెను నిక్కముగా
రామానుజుడగు లక్ష్మణుండు దా రయమున వందన మర్పించెన్!

పావని మాటలు వినుచు జనకసుత పల్లవించినా తీసె విధిన్!
'బ్రతికిన శత వర్షంబులకైనను బన్నుగ యానందమును గొనున్'
అనెడి పలుకు నిజమైన దటంచును నానందించెను జనకసుతా!
కలగా దిది నిజమే యటంచు మది గానము జేసెను హంసపదిన్!

మారుతి దాపుకు వచ్చుట గనుగొని మధురమూర్తి సీతామాతా!
రావణు డేమో యని భావించెను రహి శంకించెను హృదయమునన్!
దండకవనమున బరివ్రాజకుడై తనను మోసగించిన వాడే!
ఈ రూపముచే వచ్చినాడనుచు నిద్దై మౌనమున దల వాల్చెన్!

సీతయొక్క భావమును దెలిసికొని శీఘ్రముగా బవనాత్మజుడున్!
మధురవాక్యముల నల్లన బలికెను మాధుర్యము లలి దొలుకగనూ!
సూర్యునివలె తేజస్వి రాఘవుడు సురుచిర చంద్రుని కాంతివలెన్!
కుబేరునికి వలె విష్ణువు వలెనూ గుణనిధి బృహస్పతికి వోలెన్!

అట్టి రాఘవుడు లేని సమయమున నిట్టె రక్కసుడు నిను దెచ్చెన్!
పాపఫలము నిక ననుభవించెడిని బిన్నగ జూతువు నికమీదన్!
రామబాణమున గురియై చత్తురు రక్కసులందఱు నాహుతియై!
లంకానగరము భస్మంబగు నిక శంకలేదు మఱి యింతైనన్!

మా వానరపతి సుగ్రీవునకును మంత్రిని హనుమంతుడనమ్మా!
రాము డంపగా వచ్చినవాడను రామభక్తుడను సీతమ్మా!
విశ్వసింపు నను రామదూతగా వేఱువిధము భావింపకుమా!
శంకింపకు! నను స్వీకరింపుమా! యంకితమైనా భక్తునిగా!

పావని పలుకులు విని యా జానకి పలికె నిట్టులను మధురముగా!
రామలక్ష్మణులతో మీ కెటులను రమ్య స్నేహములు గలిసినవి?
వానర-నరులకు సమాగమం బెటు వన్నెల తీవలు బ్రాకినవి?
రామలక్ష్మణుల రమ్య రూపములు రయముగ వర్ణన సేయుమనెన్!

వైదేహి పలుకులు విని మారుతి పలుకసాగె నిటు మధురముగా!
'వినుమో జానకి! రామలక్ష్మణుల విమల రూపములు వర్ణింతున్!
కమలపత్రముల కన్నులవాడును ఘనభుజ శౌర్యుడు రాఘవుడూ!
పున్నమిచంద్రుని మోమువా డతడు పుట్టుకతో దయగలవాడున్!

తేజస్సున యాదిత్య సమానుడు ధీర యశస్సున కింద్రుండున్!
బుద్ధియందు వాచస్పతి సముడూ! బుధజనులకు సమ్మానితుడూ!
వేదవిదుడు! వేదాంగములన్నియు విపులముగను దెలిసినవాడున్!
సాధురక్షకుడు సజ్జన మిత్రుడు సారసగుణ ధర్మందతడున్!

రాముని రూపము రాముని గుణములు రమ్యవర్ణనము నాతరమా?
దైవమె రాముని రూపముతో నిల ధరణిని వెలసెనుగాదమ్మా?
శ్రీమన్నారాయణుడే రాముడు శ్రీమహాలక్ష్మివీ నీవె సుమా!
జగతికి మీరిల యాధర్శముగను జనన మొందితిరి సిద్ధముగా!

ఉత్తమపురుషుని చిహ్నములన్నియు యున్నవి శ్రీరామునియందూ!
దేవ-మానవుల సమ్మేళనమే ధీరుడు రాముని సువిలాసం!
వీరోచిత మానవుని రూపమే వికసించెను రామునియందూ!
సాటిలేని యామేటి వీరునికి సాధుమార్గమే యాదర్శం!

రామలక్ష్మణులు నిన్ను వెదుకుచును రమ్య వన్య భూములు దాటి!
ఋష్యమూక పర్వత సమీపమున ఋషులవోలె నా కగపడిరీ!
సుగ్రీవుని పంపున నే బోతిని సుందరులగు నా సోదరులన్
గొనివచ్చితి సుగ్రీవుని దాపుకు సురుచిర మైత్రికి నాంది యనన్!

వాలి భయముచే వనముల నొదిలీ యొనరగ యచ్చట నుండుటయున్!
తన కథ సుగ్రీవుండు జెప్పె నా తాపస వేష ధారులకున్!
శ్రీరాములునూ తన వృత్తాంతము జెలగి జెప్పె సుగ్రీవునకూ!
ఇరువుర కప్పుడు మైత్రి గలిగినది యింపుగ సోదరులకు వలెన్!

ఒక్క బాణమున వాలిని గూల్చెను నొనరగ శ్రీరాముం డపుడూ!
సుగ్రీవునకును బట్టము గట్టెను సొంపుగ కిష్కింధకు నపుడున్!
అంతట సుగ్రీవుం డంపె వానరుల యన్నిదిశల సీతను వెదుకన్!
అంగదు నేతృత్వంబున మేమును నలరి వెడలితిమి నిను వెదుకన్!

దక్షిణ దిశగా బయలుదేరితిమి దారి దప్పితిమి త్వరితమునన్!
వింధ్యపర్వతము నందు జిక్కితిమి వెడలు మార్గమును దెలియకనూ!
అంతట గనబడె జటాయు సోదరు డా సంపాతి ఖగేశ్వరుడూ!
లంకేశ్వరు నిలయమున జనకసుత సంకటములు బడుచున్న దనెన్!

దారితెలిసి దక్షిణదిశ బోతిమి దరికి జేరితిమి నీరధినీ!
దాటుట యెట్లని వానరవీరులు దల్లడిల్ల గను నే నంతన్!
వార్ధిదాటి నే వచ్చితి లంకకు వరుసగ నిన్నిట జూచితినీ!
రావణాసురుని లంకను గాంచితి రయముగ నిన్నును జూచితినీ.

రాముల పంపున వచ్చినవాడను రామదూత నో సీతమ్మా!
నిన్ను జూచినా వర్తమానమును నింపుగ కపులకు రాములకున్'
సమ్మతిగా వినిపింతునమ్మ నే విమ్మహి కీర్తిని గాంచెదనూ!
నిన్ను జూచితిని నీ సందేశము విన్నవింతు శ్రీరాఘవుకూ!

అంతట జానకి యా కపివీరుని యాత్మకథను నంతను వినుచూ!
ఆనందముచే హర్ష భాష్పములు నలలు దెరలుగా వర్షించెన్!
ఆతడు వానరుడని మది దలచెను నాత్మయందు విశ్వాసముతో!
రావణాసురుని మాయలు గావని రమణి సీత మది భావించెన్!

రాముడు క్షేమము తల్లీ! సీతమ! రమ్యగుణుడు సౌమిత్రియునూ!
కపులందఱు నిను జూడగోరుదురు కరుణామయి! సుగ్రీవుడునున్!
నీ క్షేమమునే కాక్షించుచు మఱి నీ చెఱ విడిపింపగ వేగన్
రానున్నారూ! లంకకు వేగమె రామలక్ష్మణులు నతిత్వరలో!

మహా తేజుడగు పవననందనుడు మహా సతిని సీతను గాంచి!
వినయవంతుడై యిటులను బలికెను విశ్వాసము గలిగించుటకై!
నీ విభు డంపిన యుంగర మిదిగో! నిర్మలమతితో గనుగొనుమా!
నీ దుఃఖము లిక నంతరించినవి నీకగు శుభములు నిక మీదన్!

నాథు డంపినా యంగుళీయకము నయగుణ జానకి జూచుకునీ!
రాహుముక్త యగు చందమామవలె రమణి సీత సంతస మందెన్!
పవనసుతుని గడు నాదరంబునను బలికె వత్సలత పొంగారన్!
హర్ష-శోక-భాష్పములను దడిపెను నంగుళీయమును జెన్నారన్!

'ఓ కపివీరుడ! మహా తేజుడవు ఒంటరిగా లంకకు వచ్చి!
రాముని సందేశమును దెల్పి నను రమ్యముగా బ్రతికించితివి!
నీ యుపకారము నెటుల దీర్తు నే నిర్మలగుణ! ఓ ధీమంతా!
పరోపకారము జేయుటయే గద పరమపురుష గుణ లక్షణమూ!

రాముడు క్షేమముగా నున్నాడా? లక్ష్మణుండు క్షేమము గాదా!
నారాముం డెప్పుడైన ప్రీతితో నను దలచున సీతా! యనుచున్!
నా వియోగమును సహించెనా మఱి నలిగిపోవునా వేదనతోన్!
అతని వర్తనము వినగా కోరిక యలరి దెలుపుమో పవనసుతా!

ఆంజనేయుడపు డతి వినయముతో నంజలి ఘటించి యిట్లనియెన్!
నీ విట నున్నావని తెలియదుగద! నిర్మలగుణుడా రామునకూ!
నే జెప్పగ విని నీరధిదాటీ నిఖిల వానరులతో గూడీ
హతమార్చును నిక రాక్షసమూకను నాదరించు నిను జనకసుతా!

నీ విరహముచే నన్నియు మఱచెను నిర్మలగుణుడా రాముండూ!
అన్నపానములు నలరు నిద్రయును నఖిల సుఖంబులు వదిలెనుగా
సుందరమగు నే వస్తువు జూచిన సురుచిరముగ నిను జూచినటుల్.
హా ప్రియే! హా సీతా! యనుచును నలరి పిలుచు నతి దీనముగా!

ఆ మాటలు విని శోకతప్తయై యా జానకి సతి పావనితో
'ఓ కపివీరుడ! నీ సువాక్యములు నొనరగ నాపతి వర్తనమూ!
దుఃఖము సంతోషముల పెల్లువలు దురపిల్లుచు నున్నవి మదిలో!
సీతారాముల ప్రేమ యెట్టిదో చిత్తమునందున గనుగొనుమా!

రాము డెవుడు నిట రాగలవాడో రహ నన్నెప్పుడు గొనిపోవున్?
రావణు నాశము లంకధ్వంసమును రాక్షస నాశము లెపుడగునో?
గడువు బెట్టె నా రక్కసుండు మఱి గలవు రెండు మాసములు సుమా!
గడువు కాల మది ముగియక ముందఱ కదిలిరమ్మనుము రాఘవులన్!

విభీషణుడు తెలిపిన హితవులనూ వినడుగదా యా రావణుడూ!
అవింధ్యుడను రాక్షస విద్వాంసుని యమృత వాక్కులను వినబోడూ!
నన్ను రాఘవుకు నిచ్చు యోచనే నయముగ లేదా రక్కసుకూ!
తోడితెమ్ము! శ్రీరామలక్ష్మణుల! దోడితెమ్ము! గపి వీరులనూ!

అన విని పావని యాజానకితో సంజలితో నీ విధి బలికెన్!
ఆరోహింపుము నాదు భుజమునను ఆ శ్రీరాముని సన్నిధికిన్!
నిను గొనిపోవుదు తల్లీ! క్షణమున నింగి మార్గమున నీరధిపై!
ఎటుల వచ్చితినో యటుల పోవుదును చటుల పరాక్రమ చతురతతో!

రాక్షసు లెందఱు నడ్డు వచ్చినను రహి నా భుజబల శౌర్యమునన్!
నిలువలేరు, మఱి గెలువలేరు సుమ! నిరుపమాన బలవీర్యందన్!
రావణు సహితము లంకను గూడను రమ్యభవన సముదాయముతో!
ఎత్తుక పోదును మృత్యువు దాపుకు సత్యము తల్లీ! జనకసుతా!

అన విని జానకి యాంజనేయుతో నతి మృదువుగ నీ విధి బలికెన్!
కనబఱచితివికదా! మారుతి! నీ కపి స్వభావమును నైజముగా!
అల్పశరీరుడ వైన నీవు నను నా రాఘవు నొద్దకు నెటులన్
గొనిపోగలవని పలికిన పావని మనసు నొచ్చి యిటులను దలచెన్!

నా విక్రమమును బలప్రభావములు నాతి జానకికి దెలియవుగా!
ఇచ్ఛ వచ్చినటు నా రూపములను హెచ్చు దగ్గులుగ పెంచునటుల్!
ఇప్పుడె నాదగు విరాట్స్వరూపము నిప్పడతికి జూపింతునుగా!
అని పావని యా యశోకవృక్షము నలరు కొమ్మ క్రిందికి దూకెన్!

ఇంతింతై మఱి యంత యైనటుల కాంతి పుంజముగ కానబడెన్!
మేరు పర్వతము పెలసిన యట్టుల చారుశీల జానకి యెదుటన్!
హనుమంతుడు దన విరాట్స్వరూపము వినువీధులపై కెగయు నటుల్!
కనిపింపగ యాజానకి మాతయు కనులు మూసి విస్మయ మొందెన్!

ఓ కపి వీరుడ! నీ పరాక్రమము నీ నిజ తేజము దెలిసితినీ!
వాయువువలె బలవంతుడువీవూ! వహ్నివోలె తేజస్వివిగా!
అయిన రాను సుమ! నీ భుజములపై యల రాఘవునీ సన్నిధికిన్!
అంతులేని యాపదలకు మూలము నటుల నేను వచ్చుటగూడన్!

చుట్టుముట్టుదురు రాక్షసవీరులు శూల ఖడ్గ ముద్గరములతోన్!
నీతో యుద్ధము జేయుచుండగా నింగిని నీరధి పైనుండి!
నే భయమందుచు నీరధి బడిపోయెద నీ వచ్చిన పని భగ్నమగున్
రామలక్ష్మణులు సుగ్రీవాదులు రహి మెచ్చరు నీ కార్యంబున్!

రామలక్ష్మణులు కపి వీరులునూ రావలె లంకకు నతి త్వరలో!
రావణాసురుని రణమున దునిమీ రక్కసు లందఱ బరిమార్చి!
నను గొనిపోవలె రాము డయోధ్యకు నయముగ సీతా రాము లనన్!
కీర్తి చంద్రికలు వెలయుగ రాముని చిరకీర్తి ధరను నిలువ వలెన్!

అటుల జేయు మో యాంజనేయ! వే బటుతరముగ వార్ధిని దాటి!
రామలక్ష్మణులు సుగ్రీవాదులు రావలె లంకకు వేగమునన్!
రావణాసురుని గర్వమడచి నను రాముని జేర్పగ పూనికతో
వేగము వారిని గొని రా రమ్మిక వేయి పుణ్యములు నీకబ్బున్!

శుభదర్శిని యగు సీత పల్కులకు శుభకరుడగు బవనాత్మజుడున్!
భక్తి వందనము లాచరించి యిటు బలికెను రాముని సతి తోడన్!
మాతా! నీవిటు బల్కుట యర్హము! మహాపతివ్రతవు నీకు దగున్!
భక్తి స్నేహముల నటు బలికితినీ భావము వేరొకటియు గాదు!

భుజములపైనీ నధిరోహించీ భూరిసముద్రము దాటగనూ!
అబల వగుటచే నతి భయమందుచు నలల దెరల బడిపోయెదవూ!
పరపురుషుని నే స్పృశింపనంటివి బన్నుగ నిజమే నద్దియునూ!
నీవిటు బలుకుట తగియున్నదీ సుమ! నీతియుక్త మిది జనకసుతా!

నే బోయెద శ్రీరాముల సన్నిధి నీ శుభవార్తను దెలుపగనూ!
అభిజ్ఞాన మేదైన నిమ్మికను యా శ్రీరామున కిచ్చెదనూ!
అని మారుతి పలుకగ విని జానకి యార్ద్రభావమున నిటు లనియెన్!
నే దెలిపెడి యభిజ్ఞానము విభునకు నిండుహృదయమున వినిపింపూ!

చిత్రకూటమున ఋష్యాశ్రమమున చిత్రముగను నా యంకమునన్
నిదుర బోయితివి యా సమయంబున నిష్ఠురమతి యొక వాయసమూ!
పొడువ సాగినది హృదయాంతరమున పొరలి రక్తబిందువు లపుడూ!
నిదురలేచితిని నిండు కోపమున నిష్ఠురమగు వాయసము గనీ!

దర్భ పుడక నట చేబట్టితివీ! తగిన శిక్ష నీకిదె యనుచున్!
బ్రహ్మమంత్రమున యభిమంత్రించీ భ్రష్టమైన యావాయసమున్!
అంతరించవజే సిటు రమ్మంటివి అంతట నది శరవేగమునన్!
వాయసంబు వెంటను బడె జంపను వహ్ని కణంబులు జిమ్ముచునూ!

ఆ వాయస మది యింద్రుని పుత్రుడు నది పయనించె త్రిలోకములన్!
శరణంబొందగా లోకేశ్వరులను సంరక్షింపరు నెవరైనా!
అంతట నది నీ పదముల పైనీ యతి వేగంబున బడి వేడెన్!
దయజూపితివీ దాక్షిణ్యముతో దక్షిణ హస్తముతో నిమిరీ!

ఈ యభిజ్ఞానము విన్నవింపుమా! యింపుగ నే జెప్పితి ననుచున్!
అట్టి వాయసముపై బ్రహ్మాస్త్రము నంపిన శ్రీరాములవారూ!
నను జెఱవట్టిన రావణుపైనీ పనుపదేల శరజాలమునూ?
రక్కసు గర్వము రాక్షస దర్పము రహి దునుమాడగ రాదేలా?

కంటికి మంటికి యేకధారగా కన్నీటిని దొలికించె ననూ!
నీదు రాకకై యెదురుజూచుచును నిలిచియున్నదని వినిపింపూ!
క్షణమొక యుగముగ గడుపుచున్నదను శాంతి లేదనుము నిముసమునూ!
రామ రామ యని నీ నామములను రమ్య జపములో నున్నదనూ!

మలినదేహమున మలినాంబరమున మర్మవేదనను జింతిలుచున్!
ఏకవేణితో దపస్వినికి వలె నీశ్వరధ్యానము నున్నదనూ!
అశోకవనమున నున్నది గానీ యంతట నిన్నే జూచుననీ!
వాడిన లతవలె కలువకాడవలె పీడగ ప్రాణము నున్నదనీ!

దయ బుట్టింపగ వలెను మారుతీ దాక్షిణ్యము గలవారతడూ!
ఎటుల దెలిపి నన్నుద్ధరింతువో యటుల దెలుపుమో పవనసుతా!
వేగమె రాముడు లంకకొచ్చునటు వేగమె నే దర్శించునటుల్!
అటుల దెలుపుమా! యటుల జేయుమా! అన్నయు దమ్ముడు నీవేగా!

కన్నతల్లివలె జూచు లక్ష్మణుని గఠినపు మాటల నంటిననీ!
మనసున కోపమునందె నేమొ సుమ మణిమణీ! దెలుపుము నా వినతిన్!
మనసారగ దీవించెనను హనుమ! మదిలో తాపము నొందెననీ!
లంకను నేబడు బాధలన్నియును శంకలేక వినిపింపుమయా!

సుగ్రీవాదులకును వినిపింపుము శుభమును నా యభివాదములన్!
నాదు జెఱను విడిపింప వేగమే నయముగ లంకకు రమ్మనుమా!
అనుచు బలికి యా శ్రీరాముని సతి యాంజనేయునికి యర్పించెన్!
కొంగున దాచిన చూడామణినీ కోటి ప్రభల జిందెడు దానిన్!

ఆ మణి గైకొని యా హనుమంతుడు నంతులేని సంతోషమునన్!
వచ్చిన పని యిటు సఫలమాయెనని వందనములతో జనకసుతన్!
ప్రదక్షిణముతో గౌరవించి మణి ప్రార్థించెను మణి రామవిభున్!
తిరిగిపోవుటకు యత్నము జేసెను తీయని మనసున గమ్యముకున్!

పవనసుతుకు చూడామణి నిచ్చుచు బన్నుగ జానకి యిట్లనియెన్!
రామవిభుడు వే చూడామణినీ రమ్యముగా మది గుర్తించున్!
నాదు జనని భూమాతను నన్నును నాయన దశరథు స్మరియించున్!
నన్ను జూచినటు నభిజ్ఞానముగ నయముగ యీ చూడామణి నిమ్మా!

కార్యనిర్వహణ ఘనుడవు నీవూ ఘనతర విక్రమ చతురుడవూ!
బుద్ధిబలమునను దేహ బలమునను యుద్ధరీతి సము లేరూ!
దుఃఖవార్ధి నే బయట బడుదునో దూరమగునో నా వేదనలా!
ఆలోచించి యుపక్రమింపుమా! అన్న! హనుమన్న! పవనసుతా!

భీమ పరాక్రముడైన మారుతీ రమణి సీతమకు నటుమ్రొక్కి!
పెడలుచుండగా నింతి జనకసుత వేగ బలికె నిటు కన్నీటన్!
నా క్షేమములను విన్నవింపుమా! నా నాథుకు కపివీరులకున్!
నను చేకొన వే వచ్చునట్లుగా నయముగ జేయుము పుణ్యాత్మా!

శతయోజనముల సముద్ర మెటువలె నతి సాహసమున దాటుటయున్?
రక్కసిమూకల నెటుల జయించుట రావణు నెటువలె ద్రుంచుటయున్!
ఆలోచింపుము! నతి సాహసుడవు! నాంజనేయ! ఓ మతియంతా!
కార్యదక్షుడవు! గదనమందునను కార్యదర్శియును నీవేగా!

అన విని పావని యాజానకితో నంజలితో నిట్లని పలికెన్!
మహావీరు లట వానరసేనను మహిాత్ములు వేల్ గలరమ్మా!
భూ పర్వత జల వాయు మార్గముల బోవు వారలెందఱు గలరూ!
అతులితమైన మహాబలవంతులు చతురమతులు నెందఱు గలరూ!

రామలక్ష్మణులు రాగలరమ్మా! రక్కసి మూకల జెండానన్!
రావణాసురుని రణమున ద్రుంచి రమణి నిన్ను గొనిపోయెదరూ!
నీకు శుభంబగు! నీకు మంగళము! నీ కష్టము గట్టెక్కినదీ!
నేజెప్పిన వెంటనె వత్తురుసుమ! నినుగొని పోదురు నిక్కముగన్!
అంతవఱకు నోరిమితో నుండుము చింతవొలగు మిక సీతమ్మా!

అన విని జానకి యాంజనేయుతో నమితాదరమున నిటు బలికెన్!
ఆంజనేయ! నీ ప్రియ వాక్యములను హర్షముచే నుప్పొంగితినీ!
పోయిన జీవము దిరిగి పొందితిని పొందినయట్లుగ నా నాథున్!
ప్రత్యుపకారము నేమి చేయుదును పరోపకారివి హనుమంతా!

కాకి కన్ను బోగొట్టిన కథనూ కాంత గుర్తు జెప్పినదనుమూ!
గండ భాగమున దిలకము బోగా గాంతి మనశ్శిల తిలకమునూ!
దిద్దినట్లుగా గుర్తు జెప్పె నను ధీరమతీ! శ్రీరాములతో!
నీ పలుకుల నా నాథుడు నమ్మును నీ కిచ్చితి చూడామణినీ!

అని యా జానకి యార్ద్రభావమున యా శ్రీరాముని మది వలచి
"హే రామా! నే ననాథనై యిటు హేయమైన రాక్షసు లందున్!
చుట్టుముట్టబడి యుండుట నే విధి జూచుచుంటివో గద స్వామీ!
ఎక్కువ కాలము జీవింపను నే గ్రక్కున దీర్పుము వేదనలన్!
నీ కొఱకే యీ బాధలన్నిటిని నిలిచి సహించితి ప్రాణప్రియా!"

అని విలపించెడి జానకి గనుగొని యాంజనేయు డిట్లని పలికెన్!
ఓ కరుణామయి? రాఘవేంద్రు డిల నొదిలెను కార్యము లన్నియునూ!
నీ విరహముచే శోక దగ్ధుడై నిరతము జింతన చే నుండున్!
పరితాపముచే లక్ష్మణుండును బరిపరి విధముల చింతించున్!

రామ లక్ష్మణులు రయమున వత్తురు రావణాసురుని దునుమాడి!
నిను గొనిపోదురు నీరజాక్షి! విను నిక్కము సత్యము నా మాటల్!
ఇంద్రుని బొందిన శచీదేవి వలె చంద్రుని బొందిన రోహిణిగా!
నీ విభు రాముని నీవు బొందెదవు నిశ్చయ మిది హే జనక సుతా!

అని పావని తా మఱలి పోవగా నాత్మ నమస్కృతి గావించి!
సెలవిమ్మని సీతమ్మను గోరెను నెలవంకగ సీతా మాతా!
పోయిరమ్ము! ఓ వానర వీరా! పోయిరమ్ము! శుభమగు నీకున్!
వీర పరాక్రమ! విజయము నీకగు! విమల మంగళము లగు నీకున్!"
రెండు జేతులను దీవన లిచ్చెను దండిగ యా హరి వీరునకున్!

అంతట మారుతి యా జానకి సతి యాశీర్వాదము నైకొనిచెన్!
వచ్చిన కార్యము సఫలమాయెనని హెచ్చుగ సంతోషము నొందెన్!
ముందు జేయవలసిన కార్యంబును మోద మలరిగా జింతింపన్!
ఉత్తర దిశగా బోయి యొక్కచో జిత్తమునం దిటు భావించెన్!

సామ దాన భేదములు రావణుని సరిచేయవు యాలోచింపన్!
యుద్ధ మొక్కటే కార్యసాధనకు సిద్ధి పొందు ద్రోవనిషింపన్!
శత్రు రహస్యము లన్ని దెలిసికొని మిత్రు లెవ్వరో గ్రహియించి!
లంక గుట్టు, రావణు రహస్యముల పొంకముగా నే నెఱిగెదనూ!

లంకేశ్వరునీ మంత్రి సత్తముల లావు బిగువులను దర్శించి!
సైనిక బలమును, సాయుధబలములు సహాయకుల బల మెఱిగెదనూ!
రావణాసురుని మత మేమో మది మనసున నున్నా కథయేమో!
అన్ని విషయములు తెలిసి పోదు నే నా సుగ్రీవుని సన్నిధికిన్!

సుందరమగు నీ యశోకవనమును జూర్ణము జేసెద మునుముందూ!
నాపై కోపము జెంది రక్కసుడు నయముగ బంపును సైన్యమునూ!
వారి నందఱిని హతము జేసెదను వరుసగ వచ్చిన వీరులనూ!
అపుడె పోదు నే నానందముగా నంగదాదులను దర్శింపన్!

ఈ విధి పావని నిర్ణయించుకొని యిట్టె బడెను నా వనమునను!
తరుల తీవెలను పూపొదరిండ్లను బొరిబొరి ధ్వంసము గావించెన్!
శిలాగృహంబులు, చిత్రశాలలను, విలాసమందిరములనన్నిన్!
అదివఱకటి రూపము గోల్పోయెను నా యశోకవన మపు డంతన్!

అంతఃపుర కాంతల ప్రదేశములు నా యశోకవన వేదికలున్!
రూపుమార్చె నా వాయుపుత్రుడట రూఢిగ జేసెను శాపముగన్!
రావణాసురుని మనసుకు గష్టము రయముగ యీ విధి గావించి!
సింహద్వారము పైని నిలిచె కపి చెలగి యుద్ధ సన్నద్ధుండై!

అశోకవనమున యలజడి విని వే నా లంకను గల రక్కసులున్!
నిదుర భంగమై లేచి చూచిరీ నిరుపమానుడగు కపి వీరున్!
అశోకవనమున రాక్షస కాంతలు నా జానకి కడ కేతెంచి!
గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నింప సాగిరట గురుతర కపివరు దెలిసికొనన్!

ఎవ్వరివాడే? యెచ్చటివాడే? యెందుం డిచటికి విచ్చేసెన్?
ఎందులకొఱకిట వచ్చెను జెపుమా యేమని నీతో భాషించెన్!
భయము లేదు మాకంత తెలుపుమా భద్రము నీ కగు మా వలనన్!
అన విని రాక్షస కాంతల కిట్లనె యా జానకి సతి సరళముగా!

ఆత డెవ్వరో యెందుం డొచ్చెనొ యెవ్వ రెఱుగుదురు నిక్కముగన్?
కామ రూపులగు మీకే దెలియును గల మాయలు మంత్రము లన్నీ!
పాముయొక్క పాదముల త్రోవలను పామే యెఱుగును సత్య మిదీ!
కామ రూపుడగు రాక్షసుడేమో కలచి చూడుడో స్త్రీలారా!

అన విని రాక్షస స్త్రీలు భయముతో నటు నిటు నేగిరి భీతిలుచున్!
కొందఱు స్త్రీలట నుండి త్వరితముగ నందడిగా లంకేశ్వరుకున్!
అశోకవనమున జరిగిన ధ్వంసము నా కపి వీరుని రూపమునూ!
విన్నవించి రట యాత్రము దోడుత వేదనతో మఱి శోకముతో!

అశోకమున కొక కోతి వచ్చినది యతి భయంకరము జూచుటకున్!
సీత తోడ మఱి మాటలాడినది జిఱు జిఱు మాటల సవ్వడితో!
ఇంద్రుని దూతయొ కుబేరు దూతయొ యెఱుగము నా శ్రీరామునిచే!
సీతను వెదుకుట కొఱకు బంపగా జేరినవాడేమో లంకన్!

అశోకవనమును సర్వనాశనము నా కపివీరుడు జేసె నహో!
సుందరమగు నా ప్రమదావనమును జూడ లేము నీ కన్నులతో!
తరు లత లన్నియు నేల గూలినవి తరుచె సీత యాశ్రయమైనా!
ఆ యశోక తరువొక్కటి మాత్రము నలరి నిలిచె నో లంకేశా!

అన విని రావణు డమిత క్రోధమున నగ్నివోలె చితి మండినటుల్!
ఆజ్ఞాపించెను నా లంకేశ్వరు నా క్షణ మందే క్రోధమునన్!
మహావీరులగు రాక్షస వీరుల మహాయుద్ధంబులు గలవారిన్!
ఎనుబదివేలా కింకరులను వే చని కపివీరుని బంధింపన్!

అంత కింకరులు భయంకరబంగు నాయుధంబులను ధరియించీ!
ఆంజనేయునీ చుట్టు ముట్టిరీ యలిమి బలిమి బంధింపగనూ!
పవన నందనుడు రూపము పెంచెను భయంకరముగా కొండ వలెన్!
వాలము నేలకు గొట్టి గర్జనల వడివడి వారలపై దూకెన్!

ఎనుబది వేలకు మించు రక్కసుల వెనుకాడక కపి పోరాడెన్!
యమసదనమునకు బంపెను వారల యతిథి భోజనము సేయుటకున్!
రామలక్ష్మణులకును జయ జయ మని రహి సుగ్రీవుని జయమనుచున్!
మరల యుద్ధమును జేయుట కొఱకై మరి సింహద్వారము నెక్కెన్!

ఎనుబది వేలా కింకరు లందఱు వానరుతో యుద్ధముజేసి!
మడిసి రనుచు విని మండిపడుచు మది మర్మముగా చింతన జేసెన్!
ప్రహస్తు పుత్రుడు జంబుమాలిని ప్రళయ భయంకరుడగు వానిన్!
సైన్యముతో జని వానర వీరుని జంపుమనుచు నాజ్ఞాపించెన్!

సింహద్వారము పైని నిలిచి నా సింహబలుడు పవనాత్మజుడూ!
తనలో దా నిటు లాలోచించెను తన్మయుడై తన చర్యలకూ!
అశోకవనమును ధ్వంస మొనర్చితి యతి సుందరమగు రావణునీ!
చైత్య ప్రసాదము నటువలె నిల్చెను చిత్రగతిని గూల్చెద నిపుడున్!

అని పవనాత్మజు డాత్మ దలచి తా నతి వేగముగా లంఘించీ!
సింహద్వారము నుండి యెగిరి యా చిత్రభవనమున పై వ్రాలెన్!
పర్వత సన్నిభమగు నా భవనము పైని నిలిచి పావని యంతన్!
రెండవ సూర్యుని వోలె నుండె దా నిండు కాంతులను జ్వలింపుచున్!

ఆ ప్రాసాదము నుండి మారుతీ యతి భీకరమగు గర్జనలన్!
లంకనంతనూ ప్రతిధ్వనించెను లంకావాసులు భీతిలగన్!
వేల రావణుల జయించెదను నే వేల రక్కసులు నొక లెక్కా?
లంక నంత నే నాశము జేసెద శంక లేదు యిక చూడు డిదే!

అంతట కావలి రక్కసులను వే యా కపి వీరుని పై బడిరి!
ఎంత పొగరురా! యంచును పావని యంతము జేసెను రక్కసులన్!
ప్రాసాదంబును గూల్చి వేయగా పావని తన బలమంతయునూ!
పూని లాగె నొక మహా స్తంభమును బొలుపుగ ద్రిప్పగ పూనుకొనెన్!

నూఱంచులు యా మహా స్తంభంబును గిరగిర జుట్టును ద్రిప్పగనూ!
అగ్ని బుట్టినది ప్రాసాదంబున యంతట జ్వాలలు గ్రమ్ముకొనెన్!
అగ్నిజ్వాలలను నా ప్రాసాదము నాహుతి యగుటను గమనించీ!
అంబర వీధిని నిలిచి పలికె నిటు అంజనా సుతుడు స్పష్టముగాన్!

రాఘవేంద్రునకు జయము! జయము! మా లక్ష్మణ దేవరకున్ జయమూ!
వానరు వీరులు రానున్నా రిక వందలు వేలును లక్షలునూ!
రావణుడుండడు లంక యుండ దిక రక్కసులుందరు నిక్కముగా!
మహాబలులు నా కంపెను మిక్కిలి మహా తేజు లా హరివీరుల్!

మహాత్ముడగు శ్రీరామచంద్రుతో మతి చలించి మీ రావణుడూ!
మహా ప్రతివ్రత జనక నందినిని మాయగ లంకకు దెచ్చె నిసీ!
పరస్త్రీలను జెరబట్టుట పాపము పాపమునకు మఱి ప్రతిఫలమున్!
లంకేశ్వరు డిక యనుభవించెడిని శంకలేక చూడుడు మీరల్!

జంబుమాలి రావణు నాజ్ఞను గొని సరగున రణమున కేతెంచెన్!
రక్తాంబరములు, రక్తమాల్యములు రమ్య కుండలములను దొడిగీ!
వజ్రాయుధముల పిడుగుల బోలెడి వరుస నస్త్రముల జేబూనెన్!
వానరవీరుని వధియించుటకై వడివడి వచ్చెను సైన్యముతో!

గార్దభ వాహనుడైన రక్కసుని గడు వింతగ పావని జూచెన్!
పకపక నవ్వుచు బరిహసించుచును భవ్య నాదమున గర్జించెన్!
సింహద్వారము పైవి నున్న యా సింహరూపుడగు కపివరుపై!
శరముల నొదిలెను జంబుమాలి కపి శిరమున, వక్షము, బాహంవులన్!

మారుతి యంతట కోపముతో నొక మహాశిలను గొని రాక్షసుపై!
విసరివేయ నాజంబుమాలియును వేసె బాణములు నా శిలపై!
తన విసిరిన శిల వ్యర్థమగుటచే తగ నొక సాలము జే బెఱికి!
జంబుమాలిపై విసిరివేసె నది సరగున వాడును జతురముగా!

పది బాణములను సాల వృక్షమును బిన్నగ కూల్చెను రాక్షసుడున్!
వర్షించెను రక్కసుడు బాణములు వరుసను మారుతి శీర్షమునన్!
ఉదయాద్రిని యరుణారుణములవలె ఉదయ సూర్యువలె భాసించెన్!
రక్తకమలముగ కనిపించెను నా శక్తియుతుడు మారుతి యవుదున్!

అంతట పావని కోపముతో నొక వింత యినుపగుదియును జేబట్టి!
గిరగిర ద్రిప్పుచు గిరాటువేసెను 'గీ' యన రక్కసు హృదయమునన్!
పరిఘాఘాతము జేత రక్కసుడు ప్రాణము లప్పుడు గోల్పోయెన్!
మూర్ఛితాంగుడై నేలగూలె నొక చుక్క నేల రాలిన పగిదిన్!!

జంబుమాలి శయనించె నేలనని సరగున విని లంకేశ్వరుడూ!
క్రోధముచే గనులెఱ్ఱగ జేసెను కొలిమి మండినటు మండిపడెన్!
మహావీరులగు మంత్రి పుత్రులను మన్ననలను నట రావించి!
కపివీరుని మదమణచి రమ్మనుచు కదిలి పొమ్మనెను రణమునకున్!

నిశాచరేశ్వరు నాజ్ఞను గైకొని నిండు గర్వమున రథములపై!
మంత్రికుమారులు నేడుగు రప్పుడు మానుగ యగ్నుల శిఖలవలెన్!
అస్త్రశస్త్రముల నిన్ని గూర్చుకొని యరుదెంచిరి రణమును సేయన్!
సింహద్వారము పైని నున్న కపి చేరువబోయిరి సైన్యముతోన్!

అంబర వీధిని రాక్షస వీరులు సంబరమున యా కపివీరున్!
శరవర్షంబున ముంచివేసిరీ యరమర లేకను నింతయునూ!
అంతట పావని యాశరవర్షము వింతగ విఫలము జేయుచునూ!
తాను గూడ నాకాశవీధిలో దగ రక్కసులను డీకొనియెన్!

అవక్ర విక్రముడైన పవనసుతు డపుడు తీవ్రముగ గర్జించెన్!
కొందఱ నఱచేతులతో జఱచియు గొందఱ నిడిగ్రుద్దుల తోడన్!
పాదములను ద్రొక్కియును గొందఱిని బడవేసెను నసువులు వోవన్!
కొందఱు జచ్చిరి భయంకరంబగు కోతిరూపమును గనుగొనుచున్!

మంత్రికుమారులు నేడుగు రప్పుడు మడిసిరి హనుమంతుని జేతన్!
సైన్యమంతయును జెల్లాచెదరై చేరె దశదిశల జీలికలై!
గజములు, అశ్వము లన్నియు బాఱెను గారెడి రక్తపు ధారలలో!
ధ్వజ ఛత్రంబులు చామరంబులును ధరణి నిబడి ధూళిని గలిసెన్!

ఒక్క కోతిచే వందలువేలును రక్కసు లొరుగుట కనుగొనియున్!
లంకంతయు గగ్గోలున బడె యే వంక జూచినను రోదనలే!
పుత్రులు వోవగ తల్లు లేడ్చిరట పురుషులు వోవగ పత్నులునూ!
తలలు మోదుకుని బొమ్మ బాదుకుని విలవిల విలపించిరి లంకన్!

మంత్రికుమారులు మడిసిన పిమ్మట మఱల యుద్ధమును జేయగనూ!
సింహద్వారము పైని నిలిచి కపి సింహనాదమున గర్జించెన్!
రామచంద్రునకు జయము! జయము! మా రామచంద్రునకు విజయంబూ!
సుగుణభూషణుడు లక్ష్మణునకు మా సుగ్రీవునకును విజయంబూ!

మంత్రిసుతులు హతమగుట తెలిసికొని యా లంకేశ్వరు డా వెనుకన్!
సేనాపతు లైదుగురి బనిచె నట జేయ యుద్ధమును గపితోడన్!
విరూపాక్ష యూపాక్షులు దుర్ధర భాసకర్ణుడును ప్రఘసుడునూ!
పంచమహా సేనానులు వచ్చిరి పనుపున రావణు జేరువకున్!

అంతట రావణు డిట్లనె వారిని యతి గౌరవమున లాలించీ!
సేనానాయకులార! వినుడు? నే జెప్పున దంతయు జక్కగనూ!
రథ గజ తురగ భటాదులచే జని రయముగ యాకపి మర్దించీ!
తెచ్చి చూపుడిదె! హెచ్చిన బలమున మెచ్చుకొనెద! నే మచ్చికతో!

సామాన్యము నగు కపిగా దల్లది సరసత గనిపించుట లేదూ!
మహా సైన్యమును నాశము జేసిన మహాభూతముగ కనిపించున్!
నాగ యక్ష గంధర్వ దేవతలు నయముగ యొక్క యుపాయముచే!
వానరరూపము దాల్చజేసి యిటు వచ్చినటుల జేసిరి యేమో!

వాలిని నీలుని సుగ్రీవాదుల వరుస జూచితిని యెంతటినో!
మహాబలుని యా జాంబవంతునీ మహిమను గూడను గనుగొంటిన్!
ఇట్టి పరాక్రమ మిట్టి తేజమును నిట్టి బలోత్సాహము ధీ యున్!
రూపధారణము జేయుశక్తి నే రూఢిగ జూడగ లేదెందున్!

యుద్ధమందు సందిగ్ధము విజయము వినుడో! సేనాపతులారా!
యుద్ధ విజయమును గోరువాడు తన బుద్ధి సూక్ష్మతను గనబఱచున్!
ఈ కపివీరుని నిగ్రహించుటకు నెంతో యత్నము జేయవలెన్!
కపి యని మనసున దేలిక భావము గలుగ నీయకుడు సఖులారా!

అనుచు బలుక యా రావణాసురుడు ఆ సేనానాయకు లపుడూ!
దలను వంచి యాజ్ఞను జేకొనుచును దరలిరి వేగము రణమునకున్!
రథగజభట తురగాదుల తోడను రమ్య వేష భూషణములతో!
పటుతర మారణ యస్త్ర శస్త్రముల ప్రళయ భయంకర ఘోషలతో!

కపివీరునితో ముందుగ తలపడె గర్వముతో దుర్ధరు డపుడూ!
ఇనుప బాణములను నైదింటిని దా బనిపెను గపివీరుని తలపై!
రక్తసిక్తుడై రంజిలె మారుతి రహిబెంచెను దన దేహమునూ!
ఎగిరిదూకె దుర్ధరుని రథముపై నిలపై బడె నా రక్కసుడూ!

అంత విరూపాక్షుడు రూపాక్షుడు నతి వేగంబున బైకెగిరీ!
గదలచేత మోదిరి వక్షంబున గరుడుని వలె గపి భువిగ్రాలెన్!
సాలవృక్షమును గైకొని వోయెను సరగున రాక్షస వీరులనూ!
మర్దన మర్దనజేసి వారలను మహిపై బడునట్లుగ చేసెన్?

ముగ్గురు వీరులు నేల కొరుగగా అగ్నిసమానులు బలవంతుల్!
ప్రఘసుడు మఱియును భాసకర్ణుడును పై పై కొచ్చిరి. క్రోధమునన్!
పట్టిస, శూలము, ముద్గరముల గొని పావని పైబడి పొడువగనూ!
రక్తధారలను రంజిలె మారుతి రక్తి బాలసూర్యుని వలెనూ!

కోపముచే పావని పెఱికెను నొక కొండ శిఖరమును చేతులతో!
ఎత్తి రాక్షసులపై బిశవేసెను సత్తువ జెడి యా రక్కసులున్!
అస్తమించి వే యసువుల నొదిలిరి యదలక మెదలక మౌనముగా!
నాయకు లందఱు సమయుట కనుగొని నలుదిశలను సైన్యము బాఱెన్!

ఆంజనేయు డపు డాగ్రహంబునను నా సైన్యము నంతను వేగన్!
రథగజభట తురగాది గణములను రయమున ద్రుంచెను క్షణముననూ!
మఱల యుద్ధమును జేయుటకొఱకై మదిని దలచి కపివీరుండూ!
సింహద్వారము పైని నిలిచి దీ సింహ గర్జనలు జేయుచునూ!

ఆ సేనాపతు లందఱు జచ్చిన యా వార్తను విని రావణుడూ!
చింతితుడై బహు దీనవదనమున జెంతనున్న తన సుతు జూచెన్!
అతిబలోన్నతుడు నక్షకుమారుడు నగ్నివోలె జ్వలియించుచునూ!
తండ్రి యాజ్ఞగొని యుద్ధోన్ముఖుడై తరలె కపిని వే మర్దింపన్!

స్వర్ణనిర్మితము రత్నభూషితము సకలాయుధములును గలదీ!
అష్టాశ్వంబుల బూన్చిన యదియును నాకాశంబున బోవునదీ!
శశి, సూర్యులవలె వెలుగు రథముపై వశము జేసికొన హరివీరున్!
మహావీరుడగు నక్షకుమారుడు మహాసేనతో బయనించెన్!

సింహద్వారము పైని నున్న యా సింహబలుడు బవనాత్మజునీ!
సగౌరవముగా గాంచి యతనితో గలగి యుద్ధమును జేయుటకై!
ముందు వెనుక లాలోచన జేయుచు మూడు బాణములతో గొట్టెన్!
ఆంజనేయు డంతట రక్కసుపై యలిగి కలియబడె గోపమునన్!

భయంకరంబగు వారి యుద్ధమున పర్వతంబులును గంపించెన్!
వాయు చలనములు యాగిపోయెనట వార్ధి పొంగె నువ్వెత్తుగనూ!
లక్ష్యనిశ్చయమునను ఘనుడగు నా యక్షకుమారుడు వేగమునన్!
బాణవర్షమును గురిపించెను నా పవనకుమారుని శీర్షముపై!

రక్తసిక్తుడై యా కపివీరుడు రక్తకమలముగ శోభించెన్!
పిన్న వయస్కుని యక్షయు గనుగొని ప్రేమను జూపెను గొంతవడిన్!
ధనుర్విద్యలో మహాఘనుండగు దానవు చతురత గమనించి!
మదిని మెచ్చుకొనె మనసు నొచ్చుకొనె మఱి పెంచెను తన రూపమునూ!

బాల దివాకరు వోలె నున్న యా బలుని జంపగను మనసునకున్!
బుద్ధిపుట్టుటయు లేదుగదా యని పొలుపుగ యాలోచించె మదిన్!
అగ్ని కణములను నార్పివేయవలె నటు జేయనిచో ముప్పగునూ!
పాముకు బాలును బోసినట్లగును బరగ యుపేక్షను జేసినచో!

అక్షకుమారుడు మేఘము కైవడి యా కపివీరుని శీర్షముపై!
పర్వతంబుపై రాళ్ళవానగా బన్నుగ వర్షించెను శరముల్!
ఆంజనేయ దపు డాతని శరముల నటునిటు బరువెత్తుచు వేగన్!
శరవేగమునకు దప్పుకొనుచు దా చంచల విద్యుత్ రేఖ వలెన్!

అంతట నా కపివీరుడు దలపడి యా రక్కసు రథ తురగములన్!
ఎనిమిదింటినీ జంపి రథమునను యిరుసు చక్రములు బడద్రోసెన్!
అంత యక్షుడిటు నేలవడియునూ యాతురతను నొక ఖడ్గమునూ!
గైకొని నింగికి యెగసె కపీశ్వరు కావర మడతు నటంచు మదిన్!

అంతట మారుతి యక్షుని పదములు వింతగ చేతను బట్టుకొనీ!
గిరగిర గిరగిర ద్రిప్పి నేలపై గిరాటు వేసెను బలముగనూ!
అక్షయు డంతట నుసినుసి యాయెను అంగాంగంబులు జూర్ణములై!
రక్తధారలకు గ్రక్కుచు ధరపై రహి మరణించెను బొబ్బలతో!

భయంకరంబగు నా యుద్ధము గని పన్నగ యక్షులు దేవతలూ!
ఆశ్చర్యంబును నానందంబును నట బొందిరి యాకాశమునన్!
అంతట మారుతి ప్రళయరుద్రువలె యా రక్కసునీ సమయించీ!
సింహద్వారము పైని నిలిచి తా సింహము దోలెను గర్జించెన్!

అక్షకుమారుడు హతమైనంతనె యాలంకేశ్వరు డా వెంటన్!
దేవతుల్య వర పరాక్రముండగు దివిజుల గెలిచిన యింద్రజితున్!
ఆజ్ఞాపించెను నా కపివీరుని విజ్ఞత మెఱయగ బంధించీ
పట్టిదెమ్మనుచు బలికె నీ విధిని భద్రమతీ! ఓ యింద్రజితా!

ముల్లోకములను జయించినాడవు ముదమున యక్షుల దేవతలన్!
భుజ బల వీర్య పరాక్రమ మందున బూర్ణ శక్తి మంతుడ వీవూ!
తపోబలముచే సర్వ శక్తులను సాధించిన బలవంతుడవూ!
నాతో సముడవు నీవే నేనూ నా బలమంతయు నీవె సుమా?

కింకరు లందఱు హతమైపోయిరి యింక జంబుమాలియుగూడన్!
అమాత్య పుత్రులు సేనాపతులను అక్షకుమారుడు హతమయ్యెన్!
అపజయ మనునది యెఱుగని మనలకు అపజయ మిప్పుడు నెదురౌ
అపజయమును విజయముగా మార్చుము అందుకొనుము నా దీవనలన్!

అగ్ని సమానుడు నా కపివీరుడు శస్త్రశస్త్రములు సరిగావూ!
సైనిక బలముల రథాశ్వబలములు సరసత నేవియు కొఱగావూ!
నీ పరాక్రమము నీ తపోబలము నీ ధనుస్సునే నమ్ముకొని!
సమరము జేయుము సరగున నాకపి శక్తి నణచి విజయము గొనుమా!

ఇంద్రజిత్తు తన తండ్రి యాజ్ఞ గొని చంద్ర సూర్యులా తేజమునన్!
వాల్గు వ్యాఘ్రముల బూన్చిన రథమును నయముగ హర్షోత్సాహమునన్!
మహాయుధంబులు మహాధనుస్సును మహాకపిని బంధించుటకున్!
రణపండితుడగు నింద్రజిత్తు దా రణమున కేతెంచెను వేగన్!

వచ్చు నింద్రజితు రథమును జూచీ హెచ్చిన యుత్సాహము తోడన్
పుడమి నింగి మేల్ ప్రతిధ్వనింపగ భూరి గర్జనలు గపి చేసెన్!
తన రూపంబును బెంచె కొండవలె దలపడె రావణు సుతు తోడన్!
సురాసురేంద్రుల వలె బోరాడిరి భూరి ప్రబల బలవిక్రములై!

అంబరవీధికి నేగి యింద్రజితు నతి ప్రబలములగు బాణములన్
వాయుపుత్రుపై వేయసాగెనూ వడివడిగా వే సరసరనూ!
పావని గూడను బోయి నింగి తన ప్రబలవశక్తితో బరువిడుచూ
శర పరంపరను దప్పుకొనుచు వే చెరచెర గంతుల రంతులతోన్!

అపుడు నింద్రజితు నాలోచించెను నా హరివీరు డవధ్యుడనీ!
బ్రహ్మాస్త్రమునూ బ్రయోగించె వే బటుతరముగ నా గపిమీదన్!
బ్రహ్మాస్త్రముచే బంధింపంబడి పడెను ధరణి మారుతి యంతన్!
బ్రహ్మావరముచే బ్రతికియుంటినని పావని మనసున దలపోసెన్!

ఏమైనను నీ బ్రహ్మాస్త్రముచే నించుక లాభము బొందుదునూ!
రావణాసురుని కనుల గాంచెదను రహి యాతనితో భాషింతున్!
సభాసదుల మఱి సారమతుల నట సకల విషయములు గ్రహియింతున్!
అని మనమున నూహించి కపివరుడు నా రాక్షసునకు నటు లొంగెన్!

అప్పుడా రాక్షసులందఱు గూడుక యాకపి వీరని బొడుచుచునూ!
అటునిటు లాగుచు చెట్లనారతో బటుతరముగ బంధింపగనూ!
వల్కల బంధముచే కపివీరుని వదిలె బ్రహ్మాస్త్ర బంధనముల్!
అయినను నా హరి యటు పూర్వమువలె నణగియుండె నటియించుచునూ!

ఇంద్రజితున కీ సంగతి తెలియును నిస్సీ! యెంతటి పని జరిగెన్!
రాక్షసులకు బ్రహ్మాస్త్రము గొప్పయు రహి మంత్రగతుల్ తెలియవుగా!
అందులకే నిటు జెట్లనారతో నంటిగట్టి రీ కపివీరున్!
విజయము సంశయమైన దనుచు దా విలవిల మనసున దపియించెన్!

బంధితుడైనా యా కపివీరుని బలముగ ద్రోయుచు ముందునకూ!
ముష్టిఘాతముల బొదుచుచు లాగుచు ముద్దుగ బలుకుచు హాస్యములన్!
లంకేశ్వరు సభలోనికి దెచ్చిరి లావుగ తమ ప్రభు వీక్షింపన్!
రక్కసులను జంపిన కపి యితడని మ్రొక్కి బలికిరీ రక్కసులూ!

*మారుతి లంకేశ్వరునకు సుగ్రీవుని సందేశమును దెలుపుట*

ఈతడెవ్వరో! ఎవ్వరివాడో యెచ్చటినుం డిట కేతెంచెన్!
ఏమిపనీ? యాశ్రయ మెవ్వరిచట యెంచి తెలియవలె సర్వంబున్!
అనుచు బలుకు సభలోని జనంబుల యందఱి పలుకులు నాలించెన్!
సభాగృహంబును బరిచారకులను సకల వస్తుతతి హరి గాంచెన్!

మహాసత్త్వుడగు రావణాసురుని మారుతి యొకపరి బొడగాంచెన్!
బంధితుడగు కపివీరుని గాంచెను బలవంతుండగు రావణుడూ
ముఖ్యమంత్రు లడిగిరి కపివీరుని మూలము వచ్చిన కార్యమునూ!
రక్కసులను జంపిన కార్యము రహి యశోకవన విధ్వంసంబున్!

భీమ విక్రముడు నింద్రజిత్తునే బ్రహ్మాస్త్రముచే బట్టువడీ!
రావణుసభలో నిలిచి మారుతీ రమ్య వైభవము దిలకించెన్!
బంగరు సింహాసనమున గూర్చుని ప్రబలుడైన లంకేశ్వరునీ!
ఇంద్రసభను నాసీనుడైన దేవేంద్రునివలె వెలిగెడి హనిన్!

దుర్ధర ప్రహస్త మహాపార్శ్వుడును దూరదృష్టిగల నికుంభుడున్!
నల్గుర మంత్రులచే బరివృతుడై వెల్గుచుండె సభ మధ్యమునన్!
ఎందఱెందఱో హిత చింతకులును నెందఱెందఱో తత్త్వజ్ఞుల్!
ఎందఱెందఱో పరిచారకులును నింద్రుని సభవలె గనిపించెన్!

ఆలంకేశ్వరు వంత గాంచి హరి యల్లన మనసున జింతించెన్!
ఏమివైభవము రాక్షసేశ్వరుని మెందుగాన మీ లోకమునన్!
బలధైర్యంబులు రూప తేజములు బహు శీర్షంబులతో వితడున్!
మందరపర్వత మట్లు శోభిలెడు నెందుగాన మీ శౌర్యంబున్!

ఇంతటి వైభవ విభవంబులుగల యీ లంకేశ్వరు మదియందున్!
దురిత కర్మములు, దురాలోచనలు దురాగతంబులు లేకున్నన్!
ఇంద్రపదవి చేకొన నర్హుండగు చంద్రుని వలె ప్రజ లెల్లరికిన్!
మంచిచేయువా డగును గదా మఱి యంచితముగ పాలించుచునూ!

దేవదానవులు యక్ష కిన్నెరలు దిక్పాలకులును యచ్చరలున్!
రావణు దురితములకు భయపడి మది రహి చెడి దాగిరి యచటచటన్!
ఇంతటి తేజోవంతున కెందుకు నింతటి దారుణ కృత్యంబుల్?
అని మది పరిపరి యాలోచించెను నాంజనేయు డా సమయమునన్!

లోక రావణుండైన రావణుడు లోకహితుని పావని జూచీ!
శంకాకుల స్వాంతుండై మిక్కిలి జంకి మదిని నిటు జింతించెన్!
ఎవడీకపి? యెందుండి వచ్చినా డీ కపి నందీశ్వరు దేమో?
కైలాసంబున బరిహసింపగా కలగి యిచ్చె నొక శాపమునూ!

ఆ నందీశ్వరుడే యీ కపిగా నరుదెంచినవా డేమోగా!
బాణాసురుడగునేమో యీతడు బల్లిదుడో యా రుద్రుండో!
అని మది చింతిలి యా రావణుండు నా ప్రహస్తుతో నా కపినీ!
ప్రశ్నింపగ విషయము సర్వమునూ ప్రాకటముగ దా బురికొల్పెన్!

ఎందుల కీ లంకకు వచ్చెను మఱి ఎందుల కా వనమున జొచ్చెన్?
ఎందుల కా వన విధ్వంసంబును నేల యసురులను దర్జింపన్?
రర్జయమౌ నా లంకకు వచ్చుట కర్జ మేల యీ రణమునకున్?
ప్రయోజనంబును నడుగుమనుచు దన బ్రహస్తు మంత్రిని బురికొల్పెన్!

అంత బృహస్థుడు నడిగె బావనిని నతిశయ సరసతలును విరియన్!
వానరవీరా! యెవ్వరి వాడవు? నెందుం డిటకును వచ్చితివీ?
కుబేరు డంపగ వచ్చితివా? మఱి కుదురుగ యమ వరుణులు బంపన్!
గుప్తచారిగా నింద్రు డంపగా గూఢముగా నిట కొచ్చితివో?

నీ తేజము వానరులకు నుండదు నిజము దెల్పు! నిను విడిచెదమూ!
రావణాలయము జొచ్చితి వెందుకు? రహి యుద్ధములను జేసితివీ?
భయము లేదు! నీకగు భద్రము కపి! బ్రహస్తుడడుగగ మారుతియున్!
గంభీరముగా ఖంగున బలికెను గల సభయంతయు నివ్వెఱబోన్!
లంకేశ్వరుతో సూటిగ పలికెను, శంకలేక నిసుమంతయునూ!

ఇంద్రాదులు నను బంపగలేదిక చంద్రుని దూతను గాదు సుమా!
జన్మచేత నే వానరుండనూ మర్మ మింతయును లేదు సుమా!
రాక్షసేంద్రు నే నయముగ చూడగ రయముగ వనమును బెఱికితినీ!
బలవంతులు నాతో దలపడగను దలపడి తింతియ నిక్కంబూ!

దేవాసురు లెవరైన గాని నను దివిరి జయింపగ లేరు సుమా!
బ్రహ్మదేవు డిచ్చిన వరమిది సుమ! బల్లిదుడను హనుమంతుడనూ!
బ్రహ్మాస్త్రముచే బద్ధుడనైతిని పన్నుగ నిను జూచుటకొఱకే!
అస్త్రవిముక్తుడ నైతి గాని, మఱి యటులె వచ్చితిని బంధములన్!

నే నొక కార్యంబునకై వచ్చితి నిక్కముగా విను లంకేశా!
రామకార్యమై రామదూతగా రహి నొచ్చితి నీరధి దాటీ!
నన్ను దెలిసి శ్రీరామదూతగా విన్నపమును నాలించినచో!
నీకు భద్రముగు! బంధుమిత్రులకు నీ లంకకునూ భద్రమగున్!

మహాసత్త్వుడగు బవనాత్మజుడూ మహాసత్త్వు లంకేశ్వరుతో!
విజ్ఞతతో గాంభీర్య ముట్టిపడ వినయము తోడుత నిట్లనియెన్!
'ఓ లంకేశ్వర! వినుము దెచ్చితిని! యొక సందేశము కుశలమునన్!
భాతృసమానుడు శ్రీ సుగ్రీవుని భవ్య ధర్మపథ యుక్తు లలిన్!

కోసల దేశపు రాజు దశరథుడు గూర్మి గాచు ప్రజ బిడ్డలుగా!
ఆయన పుత్రుడు శ్రీరాముడు గడు నమృతగుణుడు ప్రితావుడునూ!
తండ్రి యాజ్ఞచే దండకవనమును దన సతి సీతను గూడుకొనీ!
తమ్ముడైన లక్ష్మణుతో గూడను దరలివచ్చె వనవాసమునన్!

జనకుని కూతురు జనని జానకి జనస్థానము నందుం దప్పెన్!
వెదుకుచు వచ్చిరి రామలక్ష్మణులు విమల ఋష్యమూకంబుకున్!
సుగ్రీవునితో మైత్రి యేర్పడిమె సురుచిరముగ నా సమయమునన్!
సీతను వెదుకుదునని సుగ్రీవుడు స్థిరమగు ప్రతినను గావించెన్!

వాలి నొక్క బాణముతో రాముడు మొనర గూల్చి సుగ్రీవునకూ!
పట్టముగట్టెను కిష్కింధకు దా ముట్ట హర్షములు గపులందున్!
ఆ సుగ్రీవుడు గపులను వేగమె యన్ని దిశలకును బంపించెన్!
సీతాన్వేషణ కొఱకు నేనును జెలగి వెడలితిని యాక్షణమున్!

హనుమంతుడ నే వాయుపుత్రుడను నలరి లంక కిటు వచ్చితినీ!
సీతను జూచితి నీ లంకను మఱి జెప్పెడి దేమిక 'ఓ ప్రాజ్ఞా!
పరదారల నిటు జెఱను బట్టుటది పాపముకాదా లంకేశా!
అన్ని చదివితివి! యన్ని దెలిసితివి! యజ్ఞుడ వగుట ప్రశస్తంబా?

రామ బాణముల కెదురులేదు భువి రామునితో వైరము దగదూ!
స్నేహబుద్ధితో జనకనందినిని శ్రీరామున కర్పింపు మికన్!
చిర దుఃఖినిగా వేదన తోడుత సీతమ జూచితి నీ లంకన్!
పంచాస్యంబుల పన్నగ మనుచును బన్నుగ దలపుము నా సీతన్!

విషము గలిసినా పదార్థ మెటువలె వేగ జీర్ణమగు లంకేశా!
అటువలె సీతను బరిగణింపుమా! అగ్ని సమానము నెంచు మదిన్!
నీ శౌర్యము, నైశ్వర్య సంపదలు నీ తపోబలము వలనగదా!
ప్రాప్తమైన వవి వాని నిలుపుకొను! బన్నుగ పుణ్య సుకార్యములన్!

ధర్మఫలములను బొందితివయ్యా ధార్మికమగు నీ కర్మలచే!
ఇపు డధర్మమునకును దగు ఫలమును నొప్పుగ బొందెద వతి త్వరలోన్!
సుగ్రీవుడు వానరరాజు సుమా! యెనరగ రాముడు మానవుడూ!
వారలచే నీ ప్రాణము లెటులను బరిరక్షించెదవో చెపుమా!

రాముని శక్తియు, రాముని బలమును రమ్య పరాక్రమ విక్రమముల్!
ఆలోచింపుము! హితాహితంబును నలరి బంధు మిత్రాదులతోన్!
నే నొక్కడనే నిన్ను, లంకనూ నీరస బరుపగ గలవాడన్!
రామ ప్రతిజ్ఞను దలచి వదిలితిని రావణ విను! నిను, నీ లంకన్!

నీ గృహమందున నున్న జనకజను నీ మది నేమని దలచితివో!
కాలరాత్రి యది! కలచి లంకనూ కాలరాయునని దలపు మదిన్!
నీ కంఠార్పిత కాలపాశ మది నిను బూర్తిగ నాశము జేయున్!
సీతనిచ్చి శ్రీరాములవారిని శ్రీఘ్రము స్నేహము జేయుమయా!

సృష్టి, స్థితి, లయములకు గర్తయే శ్రీరాములుగా జన్మించెన్!
దుష్ట శిక్షణము, శిష్ట రక్షణము దురితములను దూరము జేయన్!
అట్టి దేవునికి యపకారములను నిట్టె బూనితివి జేయుటకున్!
సత్యముగను విను! రామదాసుడను సఖ్యము జేయుము రాములతో!

అజ రుద్రాదులు యమ కుబేరులును నఖిల దేవతలు నెవరైనా?
రాముని కెదురుగ నిలువజాలరని రహి నెఱుగుము లంకేశ్వరుడా!
నీ వదెంత? నీ లంక చెంత? నీ రాక్షస మూకయు నెంత సుమా!
అప్రియంబులను నాచరించి మఱి సుప్రియముగ నీవుందు దెటుల్!

పతివ్రతల జెఱపట్టుట పాపము పరమ పునీతల కన్నీరూ!
అగ్నిజ్వాలలై యారని మంటల నంతయు ధ్వంసము జేయునుమా!
పుత్ర మిత్ర బాంధవ సహితముగా పూర్ణాహుతి యగు సమిధలుగా!
అంతమగును నీ వంశము కీర్తియు నంతమగును సర్వస్వంబున్!

అన పావని విని యా లంకేశ్వరు డతి క్రోధమునను మండిపడీ!
క్రోధముచే గనులెఱ్ఱజేసి తన కోఱ మీసములు ద్రిప్పుచునూ!
'ఇతని వధింపుడు!' 'ఇతని వధింపుడు!' 'చితిని జేర్చి మండింపు' డనీ
దశగ్రీవుం డపు డానతిచ్చె నే తన పరిచారకులకు నంతన్!

మహాత్ముడగు నా యాంజనేయునీ మలిన చిత్తుడా రావణుడూ!
హితవచనంబుల తత్త్వము దెలియక హీనత వధ కాజ్ఞాపించెన్!
అంత విభీషణు డగ్రజుతోడను స్వాంతనవచనముల నిట్లనియెన్!
"ఓ రాక్షస రాజా! క్షమింపు మిక! యోర్మి వహింపుము శాంతమునన్!

దూతను జంపుట పాపముగాదా? దూరదృష్టితో జూడుమికన్!
ధర్మవిరుద్ధము, శాస్త్రవిరుద్ధము ధర్మము లన్నియు దెలియుగదా!
పూర్వాపరములు నెఱిగిన వాడవు బాగుగ యాలోచన జేసి!
శిక్ష విధింపుము! దూతకు దగినది శిక్షాధర్మము బాటించి!"

విభీషణుని వాక్యములను విని యా వీరుడు లంకేశ్వరు డపుడూ!
క్రోధముచే గనుగ్రుడ్లను ద్రిప్పుచు గూర్మి తమ్మునికి నిట్లనియెన్!
పాపాత్ముల నిల-భస్మము జేయుట పాప మేమియును కాదుసుమా!
పాపకారుడగు వానరాధముని బనిపెద నిపుడే యమపురికిన్!

అంత విభీషణు డిట్లని పలికెను నా భీషణుడగు రావణునితో!
దూత లవధ్యులు! అస్వతంత్రులు లలి దూతల జంపగరాదు సుమా!
ప్రభువుల యాజ్ఞను బాలింతురు దమ ప్రభువుల కనుసన్నల లోనై!
దూతకు దగు దండనము నిమ్ము మన ఘాత తెలియగా శత్రువుకున్!

ఒక యంగంబును వొలగజేసి మఱి వికలుని జేయుము విలపింపన్!
శిరోముండనము, కశాభిఘాతము శరీరమందున వాతలతోన్!
అప్రియకార్యము నాదరించె నిత డప్రియ మొందితి మందజమున్!
అయినను గూడను నితడు దూతకద! యంతము జేయుట తప్పుగదా!

ఈతని నిచ్చట బరిమార్చినచో నేమగునో యోచింపు మిలన్!
శత్రువులకు నెటు వార్తలు జేరును సమరమునకు దిగి వత్తు రెటుల్?
ప్రేరేపించెడి వారలెవ్వరిక పెనకువగా నా మానవులన్?
కావున సీతని వదులుట యుక్తము కలచి తొలచి యొక యంగంబున్!

అవక్ర విక్రమ వీరుల గైకొని యా రాములపై దండెత్తి!
చుట్టి ముట్టి వారల బంధించి శూరత్వంబును జూపనగున్!
లోకములన్నియు జయించితివి! మఱి లోకేశ్వరునకు నిది తగునా?
దూతను జంపగరాదు సుమా! యీ దురితము జేయకు లంకేశా!

అని విభీషణుడు బలుక రావణుడు ననుజుని తోడను నిట్లనియెన్!
నీవు జెప్పినది నిజము సోదరా! నీతిశాస్త్ర మటులే జెప్పున్!
దూతను జంపుట యుక్తముగా దిది దురితంబగు నీ వానరుకిన్!
మఱియొక శిక్షను విధింత మిప్పుడు మంకు వనచరుని నలయింపన్!

వానరులకు నతి ప్రియమైనట్టిది వాలము భూషణ మైన దియున్!
అట్టి వాలమున నంటింపుడు మఱి యగ్నిజ్వాలలను వే వేగన్!
లంకానగరము నంత ద్రిప్పుడిక బొంకముదు జూచును వీనిన్!
సంతసించెదరు స్త్రీలు పిల్లలును జింతించును నీ వానరుడున్!

లంకాధీశ్వరు డిట్లు పలుకగా లెంక లందఱును వే వెంటన్!
ప్రాతగుడ్డలను దోకకు జుట్టిరి పైపై బోసిరి తైలంబున్!
అంటించిరి యా తోకకు నగ్నిని నంటగట్టి కొక తేరుపయిన్!
నగరమంతయును ద్రిప్పసాగిరీ నగచరుడగు నా హరివీరున్!

ఆలోచించెను నా కపివీరుడు నదియు మంచిదనుకొనె మదిలోన్!
రాత్రి సమయమున లంకానగరము రహి నే జూడగ లేదుగదా!
ఈ సమయంబున జూచెద లంకను విందునందుగల చిత్రములన్!
అనుచు కట్టువడె యా రాక్షసులకును నదురు బెదురు నటనల తోడన్!

క్రూరకర్ములగు రాక్షసు లప్పుడు హరివీరుని జేకొనిపోయి!
శంఖనాదముల దప్పెట వేయుచు సరసవాద్యముల మ్రోయుచునూ!
గూఢచారి యని కేకలు వేయుచు గుమిగూడిరి లంకంతయునూ!
త్రిప్పసాగిరట దిశలన్నియునూ నొప్పెడు సుందర వీధులనూ!

స్త్రీ వృద్ధులు బాలకులు వచ్చి యా చిత్ర వానరుని గాంచుచునూ!
పండ్లిగిలించుచు ముక్కు గోకిగొని పలుహాస్యములను బల్కుచునూ!
ఆనందించిరి లంకావాసులు నా కపివీరుడు స్పందించెన్!
లంకానగరపు వీధులు సందులు వంకలేని యా సౌధములన్!

హనుమంతుని నటు త్రిప్పుట గాంచుచు నాయశోకవన స్త్రీ లంతన్!
బిరబిర బోయిరి చరచర జెప్పిరి బిట్టుగ జానకితో నిటులన్!
నీతో ప్రియములు బలికిన కోతికి నిప్పంటించిరి తోకకునూ!
నగరమంతయును త్రిప్పుచుండిరని నయముగ జెప్పిరి చిత్రముగన్!

అంత జనకసుత శోకతప్తయై అగ్నిహోత్రు నటు బ్రార్థించెన్!
వార్తను దెచ్చిన వానర వీరుని యార్తిని బాపు మటంచు మదిన్!
మహా తపస్విని ప్రార్థనవిని యా మహాగ్నిహోత్రుడు వే వెంటన్!
ఆ కపి జ్వాలను జల్లన బఱచెను నటు జల్లగ వాయువు వీచెన్!

అగ్నిజ్వాల లిటు మండిన గూడను నా వాలమునను గూడుకొని!
బాధలేదు నా కింతయు గూడను బహుశీతలముగ మంచు వలెన్!
నుండుట కారణ మేమో తెలియదు దండిగ జానకి దీవెనలో!
అగ్ని వాయువుల యపారకరుణలు యూరసి నను కాపాడుటయో!

రామకార్యమున బయలు దేరగా రమ్యగుణుడు శ్రీసాగరుడున్!
మైనాకుడు నా కెదురుగ వచ్చిరి మదిని సంభ్రమము నుప్పతిలన్!
అగ్నివాయువులు నటులే నా యెడ నాదర భావము గనబఱచీ!
చల్లబఱచి రిటు నగ్నిజ్వాలలను శాంతిని బొందగ మానసమున్!

అటు లా మారుతి యాత్మ దలంచుచు నతి వేగముగా బంధములన్!
ద్రెంచివేసి యొక గంతువేసెనూ! యంచితము పురద్వారముపై!
క్షణకాలమునను సూక్ష్మరూపుడై కల బంధనములు వొలగించీ
శైలాకారము దాల్చెను బావని వెలగి మేఘముగ గర్జించెన్!

సింహద్వారము నందు గలిగినా వెలగి పరిఘ నట గ్రహియించీ!
కావలి రక్కసు లందఱ జంపెను గఠినముగా మర్దింపుచునూ!
అగ్నిజ్వాల మండెడి వాలముతో నా హరీశ్వరుం డపుడుండెన్!
సురుచిర కాంతుల దీపించెడి యా సూర్యుని వోలెను భాసించెన్!

వచ్చిన కార్యము పూర్తియాయె నా వరుసను కార్యము లన్నియునూ!
ప్రమదావనమును భగ్న మొనర్చితి ప్రముఖ రాక్షసుల వధించితిన్!
రావణునకు మఱి లంకనున్న యా రాక్షసులకు సంతాపంబున్!
కలుగజేతు కాఠిన్యము నైనను కార్యము నొక్కటి విజయమునన్!

అనుచు మదిని చింతించి మారుతీ యతి వేగముతో వాలమునన్!
ప్రజ్వలించు నా యగ్నిజ్వాలతో భవనంబులపై చరించుచున్!
అర్పణజేయగ సాగె నంత నా హవ్యవాహునకును ప్రీతిన్!
ప్రాసాదంబులు రాజభవనములు ప్రమదోద్యానము లన్నియునూ!

అతి బలవంతుడు నాంజనేయుడపు డా ప్రహస్తునీ గృహమునకున్!
మహాపార్శ్వునీ యింద్రజిత్తు మఱి మహా రాక్షసుల భవనములన్!
తోకనున్న యా మంటల నటు నిటు తోరణముగ వే ద్రిప్పుచునూ!
భస్మము జేసెను మహా భవనములు బట్టవగలు నందఱు జూడన్!

విభీషణుని సదనంబు మాత్ర మట విడిచెను దక్కిన భవనంబుల్!
అగ్ని మంటలను భస్మము జేసెను హాహాకారము జెలరేగన్!
రావణాసురుని భవనము సహితము రహి మంటలు నింగికి లేవన్!
ధ్వంసమాయె నా కాంచన భవనము ధ్వంసమాయె లంకంతయునూ!

లంకా వాసులు నార్తనాదమున సంకటపడి రోదనములతోన్!
హా! తండ్రీ! హా! తల్లీ! యనుచును హా! పుత్రక! మిత్రా యనుచున్!
జీవితేశ్వరా! కాంతా! యనుచును జెలగి యేడ్చి రపు డా యగ్నిన్!
మృతి జెందిన బాంధవులను దలచుచు గతి యిట్లాయె గదా యంచున్!

అగ్ని జ్వాలలను నాహుతి యాయెను యా లంకాపుర మపు డంతన్!
హనుమంతుని గనులార జూచి వే యా రాక్షసు లందఱు భీతిన్!
అగ్నియో, సూర్యుడో, యముడో, రుద్రుడో యా చతురానను డగునేమో
బ్రహ్మ విష్ణువులు నీ కపి రూపము బరగ దాల్చి యిటు వచ్చెననీ!
పరువులు బెట్టిరి బ్రతుకు దీపితో బన్నుగ సర్వము నొదులుకునీ!

మరుభూమిగ లంకంతయు మారెను మఱి మిన్నంటెడి మంటలతో!
పెట పెట ధ్వనులను సర్వ వస్తుతతి చిటపట సవ్వడి బూడిదయై!
రథ గజ తురగము లన్ని భటాళియు రహ జ్వాలలతో నాహుతియై!
భయంకరంబగు కల వలె నుండెను పెను మృత్యువు నిల్చిన విధిగా!

లంకంతయును నీ విధి జేసెను బింకమునను బవనాత్మజుడూ!
మండుచున్న తన వాలము నంతట మహోదధిని జల్లన బఱచెన్!
మహామతియు, నా శక్తియుతుడగు మారుతి కార్యము శ్లాఘించి!
దేవ సంఘములు నబ్బుర మందుచు దేరి చూచినవి యా లంకన్!

సందీప్తంబగు లంక కనుంగొని చారుశీలుడా కపి తనలో!
చింతించెను భయమందెను మనసున వంత జెందె చేసిన పనికిన్!
ఎంత ఘాతుకము జేసితిని నే నింతయు లజ్జను లేకయునూ!
తగునా సత్పురుషుల కిది యని మది తనను దానె నిందించుకొనెన్!

తన కోపమె తన శత్రువంచు మది తగ చల్లార్చుకొనం దగునూ!
అట్టి వారినే మహాత్ములందరు నట్టి వారలే ఘనులు సుమా!
కోపము నెంతటి కార్యమైన దా గొంకక వెనుకాడక జేయున్!
గురువుల జంపును గూర్మి బంధువుల పరుషము లాడును రోషమునన్!

క్రోధమనగ నదీ కొఱివి సమానము గోకికొనును దనకును దానే!
యుక్తాయుక్తము మంచి చెడ్డలును శక్తిని శాంతిని గోల్పోవున్!
పాము కుబుసమును నొదిలినట్లుగా బన్నుగ నొదులునొ సహనముతో!
అట్టివాడె సుమ నీ ధరిత్రిపై గట్టివాడు సచ్చరితుండౌ!

దుర్బుద్ధియు లజ్జారహితుండును దోసకారి మఱి లేడు సుమా!
జానకి మాతను నాలోచింపక సరగున లంకను గాల్చితినీ!
లంక కాలునపు డా జనకాత్మజ యతి భీకరమగు జ్వాలలలో!
భస్మమైనదో పతిని దలంచుచు యస్మదీయులను దలచుకొని!

లంకా నగరము దగ్ధ మొనర్చితి శంక లేదునిం దింత [illegible] సుమా!
క్రోధముతో నీ కార్యము జేసితి కూలిపోయె సర్వస్వంబున్!
జనకనందినీ దగ్ధమైనచో జేసెడి దేమిక యుండు నిటన్!
ప్రాణము లొదులుట మంచి దిచట నా పన్నుగ వానర చపలతకున్.

సీత నష్టమై పోయెనంచు నే జలగి దెలుప శ్రీరాములకూ!
రామలక్ష్మణులు నశింతు రప్పుడు రయమున రాజు సుగ్రీవుడునూ!
భ్రాతృ వత్సలుడు భరతుడు జచ్చును శత్రుఘ్నుండును నా వెంటన్!
ఇక్ష్వాకుల వంశము నాశంబగు నిల ప్రజలకు శోకము మిగులున్!

అంత పావనికి శుభ శకునంబులు స్వాంతము నందున నగుపించెన్!
సీత బ్రతికి యుండును నిల దప్పక చేరి కాల్ప దా యగ్నియునూ!
నన్ను దహింపని వహ్ని యెట్టులా ఋతివను సాధ్వి జనక సుతన్!
కాల్పగల్గు? గరుణించును జల్లని గాలులతో వింజామరలన్!

"సర్వము లంకంతయును దగ్ధమై, సర్వ వినాశము గలిగినన్నూ
సీత సురక్షిత! చోద్యము! వింతయు శీలవతిని యా యగ్ని శిఖల్!
ఆహుతిగా గొనలేదు నా సతియు అగ్ని సమానము బతి భక్తిన్!"
అనుచు చారణులు ననుకొను మాటలు నా మారుతి వినె నెమ్మదిగన్!

అమృత సమానములైన వాక్యములు నా మారుతి యానందమునన్!
ఎగిరి గంతు వేసెను తన వాలము నెగసి భుజమునను నడయాడన్!
కార్యసిద్ధిపై గడితేరితి నని కరుణ శీల సీతాదేవిన్!
చూచి పోవమని నిశ్చయించుకొనె సురుచిరముగ మఱియొక మారున్!

శింశుప మూలము నున్న జానకిని శ్రీఘ్రముగా నటు జేరుకొని!
అక్షతగా గమనించి యా యమను యానందంబును బొందుచుమా!
శిరము వంచి కై మోడ్చు లిడుచు వా జెచ్చెర బోవగ నుంకింపన్!
ప్రస్థానోచితుడైన పావనిని బన్నుగ జానకి యిట్లనియెన్!

నాయన పావని! ఒక దిన మైనను నయముగ నుండుము నెటనైనన్!
మహార్తమైనను సుఖముండదు నే మోద మలరగను జూచి నినున్!
మఱల వచ్చుదాకను బ్రదుకుదు నను మదియం దాశలు లేవు సుమా!
దుఃఖముపై నొక దుఃఖము వచ్చుట జూచు చుంటివిగ నీ లంకన్!

నీరధి నెట్టుల దాటుదురో మఱి నెటు రావణు మర్దింపుదురో!
నను గొనిపోదురొ రామలక్ష్మణులు వర్మిలి కోసల భూములకున్!
రామ పరాక్రమమునకు జోడుగా రహి కార్యములను జరిపించీ!
నన్ను వేగ కొని పోవగ చూడుము అన్నా! హనుమన్నా! వేగమునన్!

అని పలుకగ జానకి మారుతితో నాంజనేయు డిటులను బలికెన్!
సుగ్రీవుండు ప్రతిజ్ఞ జేసె నిను సూటిగ జెఱ విడిపింతుననీ!
వానరసేనల భల్లూకంబుల వరుస దీసికొనివచ్చు నికన్!
లంకయంత భీభత్సమగును సుమ! యింక తాళు మొక మాసములోన్!

రామలక్ష్మణులు తమ బాణంబుల రావణు రణమున దునుమాడీ!
పుత్ర మిత్ర బాంధవ సహితముగా పూర్ణాహుతి వే గావించీ!
నిను గొనిపోదు రయోధ్యకు నిక్కము నిర్మల మతి శాంతిని గొనుమా!
శశాంకు జేరిన రోహిణి విధమున జెన్నొందెదు శ్రీరాములతో!

పవన పుత్రు డిటు జానకి మాతను బన్నుగ యోదార్చెను మీదన్!
మరలిపోవగా నిశ్చయించుకొని మానుగ జేసె నమస్కృతులన్!
సీతాదేవియు జిన్న బోవుచును జింతించుచు దీవన నొసగెన్!
చిరంజీవివై వర్థిలు మనుచును జేర్చి కరములను శీర్షముపై!

*సీతా సందేశమును గైకొని పావని కిష్కింధకు వచ్చు*

జానకి యాశీర్వాదము గైకొని సాగరమధ్యము లంఘించి!
రామదర్శనోత్సుకుడై పావని రయమున బోవగ నెంచుకుని!
అరిష్టమను నొక పర్వతమెక్కెను నద్భుతముగ తా పైకెగిరెన్!
దక్షిణ తీరమునుండి యుదీచికి దరలిపోవ బోవాడగె నహో!

మహావేగమున నా హనుమంతుడు మహాసముద్రము పైనుండి!
రెక్కలు గలిగిన పర్వతంబువలె రిక్కవోలె బోవుచునుండెన్!
మేఘమాలలో దాగుచు వెడలుచు మిలమిల మెరిసే చంద్రునిలా!
మబ్బుల చాటుకు బోవుచు వెడలుచు మరి ముందుకు సాగుచుచుండెన్!

సాగరమధ్యమునందు జూచె కపి సరసత మైనాకుని మరలన్!
చిరునగవున యా పర్వతేంద్రు మరి చేరిహస్తమున స్పృశియించెన్!
విడిచిన బాణమువోలె వేగ దా వెడలె నుదీచీ తీరముకున్!
కర్మవీరు లెపుడును సైపరుగా కార్యమునం దాలస్యమునూ!

ఉత్తరతీరము జేరి మారుతియు యున్నతగిరిని మహేంద్రమునూ!
గాంచి గర్జనలు జేసె దశదిశల గ్రమ్మగ నాదము ప్రతిధ్వనులన్!
అచ్చటగల కపివీరు లందఱును హెచ్చిన మోదము నుప్పతిలన్!
వాయుపుత్రుని జూడగ నిలిచిరి వరుసను జేతులు గట్టుకొని!

జాంబవంతు డిట్లనె యా గపులకు అదిగో! మన మారుతి వచ్చెన్!
కార్యము నదె సాధించియు వచ్చెను గర్జన లవి మఱి యందులకే!
అంతలోనె హనుమంతుడు వాలెను నామహేంద్రగిరి శిఖరములన్!
రెక్కలు తెగినా పర్వతంబువలె పక్కివోలె క్రిందికి దూకెన్!

వానరవీరులు స్వాగత మిచ్చిరి వన్నెల చివురులు బూవులతో!
ఫలమూలంబులు వృక్షాగ్రములను బిన్నగ దెచ్చిరి పూజింపన్!
సంతోషంబున గంతులు వేసిరి సరసత పకపక కిచకిచలన్!
తోకలెత్తుకొని యాడింపుచును తోరపు నృత్యము జేసి రటన్!

జాంబవంతునకు నంగదునకు మఱి నటగల వానర పూజ్యులకున్!
ఆ మారుతి యాత్మాభివందనము నర్పించెను బహు వినయమునన్!
సీతాదేవిని దర్శించితి ననె జేరి కపులు విన నందఱునూ
హనుమంతుని యా యమృత వచనముల నానందించిరి కపులంతా!

అశోకవనమున జూచితి సీతను యారాక్షస స్త్రీ మధ్యమునన్!
ఏకవేణితో మలినాంబరమున నింపుగ దలచుచు రఘురామున్!
ఉపవాసములను గ్రహించి యున్నది యురుతరమగు నియమములందున్
కటిక నేలపై తపస్వినికి వలె గాంచితి యా లంకా నగరిన్!

సాగర లంఘన మెటు జేసితివో సరసత లంకను జూచితివో!
రావణాసురుని నెటు గాంచితివో రమ్యమైన యావనమందున్!
సీతాదేవిని నెటు గాంచితివని చేరి యడుగ కపు లందఱునూ!
మారుతి జెప్పగ వినుకోరికతో మఱి నభదీర్చిరి కపులంతా!

మహేంద్రపర్వత శిఖరము నందున మారుతి యాకపి వీరులునూ!
మోదమునందిరి జాంబవంతు డట సాదరమున బవనాత్మజునీ!
జరిగిన దంతయు జెప్పుమనిన యా జరిగిన వృత్తాంతము నంతన్!
వివరముగా విశదీకరింపగా బవనసుతుం డట బూనుకొనెన్!

మీకడ యాజ్ఞను గైకొని నెగసితి మింటికి నీ శిఖరమునుండీ!
సంద్రముదాటీ లంకను జేరగ సరసత సీతను గనుగొనగా!
మధ్యదారి నట యడ్డుగ నిలిచెను మైనాకుడు నను పర్వతమూ!
అతిథి వగుచు విశ్రాంతి గైగొనుమనుచు నాదరమున శిఖరము నందున్!

సాగరుడంపగ వచ్చితి హనుమా! సరసత నాకును జుట్టమవూ!
వాయుదేవునకు గృతజ్ఞుడను నే వరుసను నీకును నట్లగుదున్!
ఉపకారము జేసిన వారికి బ్రత్యుపకృతి సలుపుట ధర్మంబౌ
మమ్ము గృతార్థుల జేయుమనుచు నా మహనీయుడు నను వేడుకొనన్!

రామకార్యమై బోవుచుంటినని రయముగ బోవలెనని యనుచున్!
మైనాకుని సౌహార్ద్రభావమును మనసున మెచ్చుచు నటనుండీ!
ముందుకు బోవగ నాగమాత నను నందు కొనగ యాకలి దీరన్!
నోరుదెఱచినది నేను బెఱిగితిని బెఱిగెను దానును నా కంటెన్!

అంతట నే నొక సూక్ష్మరూపమున యాసురసా గర్భము నందున్!
జొచ్చి వెడలితిని మెచ్చె నన్నదియ హెచ్చిన ప్రేమను గనబఱచి
కార్యసిద్ధి యగుగాక నీ కనుచు గ్రమ్మర దీవన లందించెన్!
సీతారాముల జతగూర్పమనీ జెలగి రక్కసుల వధియింపన్!

అంత నేను మఱి ముందుకు బోవగ యటు సింహిక యను రాక్షసియున్!
ఛాయను బట్టుక లాగసాగినది చరచర క్రిందికి దిగజారన్!
దాని గర్భమున జొచ్చి గుండెనూ వినువీధికి నే గొనిపోవన్!
జాచుచు చేతులు జచ్చి నీటపడె ఛాయా సింహిక రాక్షసియున్!

అంత నీరధిని దాటి లంకలో నడుగుపెట్ట బోవుచునుండన్!
లంకారాక్షసి యెదుట నిలిచి నను బింకముగా బోరాడు మనెన్!
అంత నేను బిడిగ్రుద్దు మోదగా నది నేలను పడి ద్రిమ్మరుచున్!
గెలిచితి వీవే రాక్షసులకు నిక కీడు లంక కిక వచ్చెననెన్!

లంకాపురమున ప్రవేశించి నే లలనామణి సీతను గాంచన్!
వెదకి వెదకి తుద కా యశోకవన వీధిని జూచితి జనకజనూ!
రాక్షసకాంతల మధ్యమున్న యా రమణి తపస్విని పతివ్రతనూ!
కటిక నేలపై శయనించిన యా కాంతను శ్రీరాముని సతినీ!

ఇంతలోనె రావణుడచ్చటికిని వింతవేసమున బడి వచ్చెన్!
ఇంతి జానకిని స్వీకరింపుమనె కాంతునిగా దను జూడుమనెన్!
కాంత సీత యాలంకేశ్వరు నట గడ్డి పరకగా భావించెన్!
పండ్లు గొరుకుచును రావణుడప్పుడు బరగ వధించెద నను చుండన్!

ఆ మందోదరి యారావణు సతి యడ్డు కొనుచు నా రావణునీ!
హితబోధనలను జేసెగాని మఱి హితమును వినడా రావణుడూ!
రయమున రెండే నెలల లోపలను రాణివి కమ్మని బెదిరించెన్!
అటులకానిచో రక్తము ద్రావెద ననుచు వెడలె నా రక్కసుడూ!

రాక్షస కాంతలు దూషణములతో రవలుజేయు నా జనక సుతన్!
త్రిజటా యను రక్కసి యట జేరీ తీయని మాటల నిట్లనియెన్!
నే నొక స్వప్నము గాంచితినమ్మా! నిజముగ జరుగును రోజులలో!
రాముని విజయము! రావణు నాశము! రాత్రి నే గలను గాంచితినీ!

సీత నిటుల దర్జింపకు డమ్మా నీతి విడిచి భర్జింపకుడూ!
చెడు దినములు లంకకు రానున్నవి చేటు రక్కసుల కిక మీదన్!
సీతాదేవిని క్షమాభిక్ష నిక జేరి యడుగుడము ననె నంతన్!
రాక్షస స్త్రీలట యదురుచు వెదురుచు రయమున బోయిరి నిదురింపన్!

అంత యశోకము నుండి బలికితిని యా రాముని చరితము నంతన్!
వినిపింపగ హర్షమున జానకీ విమల భాష్పములు వర్షించెన్!
ఎవరు నీ వనుచు ప్రశ్నింపగ నే నింతలేక నా చరితమునూ!
రాముని గుణములు వినిపించితినీ రమ్య విలాస పరాక్రమమున్!

కామరూపియగు రావణుడంచును కాంత సీత నను నమ్మకనూ!
కోపముతో నను జూచ వినయమున సాదరముగ నా యుంగరమున్
రాము డంపినాడని యిచ్చితినీ రమణి సీత ముదమందగనూ!
ఘన మగు నా రూపము జూపించితి గగనవీధులను బెరుగుచునూ!

అంతట జానకి యా రాముని సతి యాత్మను నమ్మెను నన్నపుడూ!
రామలక్ష్మణుల క్షేమము లడుగుచు రయమున మనసున బులకించెన్!
వినిపించెను దన దీన గాథలను వినిపించెను తన దుఃఖమునూ!
రావణాసురుని హీన వాక్యములు రాక్షస కాంతల దుర్భాషల్!

అంతట నోదార్చితి నే సీతమ శాంతియుతంబగు బాషణలన్!
ఓ జానకి సతి! యోర్పు వహింపుము వత్తురు వేగమె రఘువీరుల్!
లంక నంత నాశము జేయుదురిక శంక లేదు నిసుమంతయునూ!
రాక్షసేశ్వరుడు నేల గూలు నిక రాక్షస నాశము సమకూడున్!

రామలక్ష్మణులు నిను గొనిబోదురు రయముగ నయోధ్య పురమునకున్!
శశాంకు జేరిన రోహిణి విధమున సరసరీతి నీ విభుతోడన్!
శోభించెద విక బోయివచ్చెదను శుభకరుడగు శ్రీరాములకున్!
అభిజ్ఞాత మేదైనా నొసగుము నందజేయుదును నమ్మునటుల్!

అని నే వలుకగ నలరి జనకసుత యపూర్వమగు చూడామణినీ!
నా కొసంగినది యభిజ్ఞాతముగ నయముగ తన విభునకు జూపన్!
కాకాసురునీ కథ జెప్పినదీ కరుణ జూడుమని ప్రార్థించెన్!
రామచంద్రునకు నయముగ జెప్పెద రమణి సీత సందేశమునూ!

అంత జనకసుత యాజ్ఞను గైకొని యట జని యోజన జేసితినీ!
వచ్చిన కార్యము సఫలమాయె నిక యొనరగ రావణు జూడవలెన్!
అని మనసున భావించి యచటగల యా యశోక ప్రమదావనమున్!
పాడు జేసితిని కావలివారలు బిన్నగ రావణుతో జెప్పన్!

రావణు డప్పుడు మహాకింకరుల రయముగ బంపెను రణమున !
సింహద్వారము నెక్కి ఘోరమగు సింహగర్జనలు జేయుచునూ!
పరిఘ నొక్కదానిని గైకొంటిని పరగ కింకరుల నందఱినీ!
వరుసపెట్టి మోదితి మరణింపగ వల్లకాడుగా మారె నటన్!

అంత రావణుడు గ్రోధముతోడను మంత్రి పుత్రులను బంపెనహో!
వచ్చినదారిని వచ్చినట్లుగా వరుసబంపితిని యమపురికిన్!
సేనాపతులను బంపె నైదుగుర ఛేదింపగ నను వేగమునన్!
ఛేదించితి నే నందఱ నప్పుడు చివఱివాడు మిగులక యుండన్!

అంత రావణుడు ముద్దుకుమారుడు నక్షకుమారుని రణమునకున్!
బంప నతని నే నేలకుగొట్టీ జంపి వేసితిని నాక్షణమున్!
రథగజతురగ భటాది సంఘముల మథనము జేసితి రణమందున్!
రాక్షసు లదరగ లంకనంతటిని రవరవ జేసితి భీతిలగన్!

అంత రావణుడు క్రోధముతో తన స్వాంతమునందున వ్యథజెందీ!
మహావీరుడగు నింద్రజిత్తునూ మహాకపిని వే మర్దింపీ!
కెట్టితనము వేజూపి రణమందు పట్టి తెమ్మనెను సన్నిధికిన్!
సామాన్యమునగు గపికా డాత డసామాన్యం డని చెవిజెప్పెన్!

అంత యింద్రజితు బ్రహ్మాస్త్రముచే నంట గట్టి రావణు కడకున్!
బట్టుకబోయెను యెదుట నిల్పె నను ప్రశ్నలు వేసెను రావణుడూ
ఎక్కడివాడవు? ఎవ్వరివాడవు? యెందుం డిట కొచ్చితి వనుచున్
ఖచ్చితముగ నే రామదూతనని ఖండితముగ బలికితింతన్!

ఆంజనేయుడను వాయుపుత్రుడను నరివీరభయంకరుడను నే!
సుగ్రీవుడు బంపగ వచ్చితినీ సుగ్రీవుని సందేశమునూ!
రామలక్ష్మణులు లేని సమయమున రయమున శ్రీరాముని సతినీ!
దొంగిలించి తెచ్చితివి మాయగా దోసము కాదా లంకేశా!

పరదారల నిటు బట్టితెచ్చు టది పాపము కాదా లంకేశా!
పతివ్రతల కన్నీటి జాలులే భయంకరంబగు పెల్లువలై!
నిన్ను ముంచు నీ వారలముంచును నీ సంపదలును నశియించున్!
వల్లకాడుగా మారును లంకయు వల్లని పనులను జేయకుమా!

సీత నిచ్చి శ్రీరామచంద్రుతో స్నేహము జేయుము లంకేశా!
కరుణామయు డా రాముడు సుగుణుడు కరుణ నిన్ను గాపాడు సుమా!
బంధు మిత్రులను నాశనమొనర్చకు పన్నుగ రాజ్యము శ్రీనంతన్!
రామబాణమున కెదురులేదు సుమ! రగిలి లంక వే బుగ్గగునూ!

అని నే పలుకగ యాలంకేశ్వరు డలిగి క్రోధమున జ్వలియించెన్!
నన్ను వధింపగ యాజ్ఞజేసె నా సన్నిధినిం గల సైనికులన్!
అంత విభీషణు డడ్డువచ్చి దా చింతను జేసెను సభయందున్!
దూతను జంపగరాదటంచు నిది దోసకార్యమని పేర్కొనియెన్!
అంగవికలుగా జేయ వచ్చునని ఆదియె జేతునని రావణుడున్!

కోతుల కెల్లను ప్రీతి తోక మఱి తోకకు నిప్పంటింపు డికన్!
తోకలేని యీ కోతి బోవు తన కోతులకడకు విచారమతిన్!
లంక నంత యీ కోతిని ద్రిప్పుడు లావు బింక మణగారగనూ!
అన వే సైనికులంతనె జుట్టిరి నా తోకకు బలు వస్త్రములన్!

తైలము బోసిరి నిప్పంటించిరి తగ లంకానగరము నంతన్!
ద్రిప్పసాగిరట శంఖనాదముల జెప్పిరి వేగులవాడనన్!
లంకానగరము నంతను జూచితి లలిత సుందరములగు వీథుల్!
అందమైన భవనములను జూచితి యలరు జిత్రశాలలు గంటిన్!

అంత నేను బంధములను ద్రెంచితి నలిగి విముక్తుడనై వేగన్!
మండుచున్న వాలము పై కెత్తుచు మఱి లంకాపురి సదనములన్!
కాల్చివేయుటకు మొదలు బెట్టితిని కనికరమి మింతయినను లేకన్!
అగ్నిహోత్రునకు నాహుతి జేసితి యా లంకానగరము నంతన్!

అగ్నిజ్వాలలకు నాహుతికై తమ యాలుబిడ్డలను గానకనూ!
రక్కసు లందఱు నేడ్వసాగిరట మెక్కి మెక్కి మిక్కిలి ధ్వనులన్!
పశ్చాత్తాపము నొందితి నేనును బన్నుగ నా జేసిన పనికీ!
కోపముతో నేనెంత జేసితిని కోపము పాపమనెంచితినీ!

ఈ మంటలలో జనకనందినీ యేమైపోయినదో యంచున్!
మనసు బాధపడ మఱుక్షణమందున మధుర వాక్యముల నే వింటిన్!
'సీత సురక్షిత' యంచు చారణులు జెప్పికొనుచు నుండగ వింటిన్!
'మనసు చల్లపడె' సంతసించితిని మఱి యా రాముని కృపయంచున్!

మఱలి పోవుటకు ముందు నొక్కపరి మాతసీతమను గనుగొనగన్!
నిశ్చయించి వాలమున యందు గల చిచ్చునార్పితిని సంద్రమునన్!
పోయి చూచితిని జనకనందినిని బొందితి దీవనలను వేగన్!
సముద్రమును యిటు దాటి వచ్చితిని చయ్యన మీ దర్శనమునకై!

లంక దాటితిని సీతను జూచితి లావురక్కసుల పొగ రణచి!
లంకేశ్వరునకు బుద్ధులు జెప్పితి లంకను గాల్చితి భయమందన్!
ఇంతపనిని నే జేసితి నిట్టుల యిట్టె మూడు రోజులలోనన్!
చేయవలసినది బూర్తిచేయు డిక చెలగి చేయవలసినందంతా!

అని పవనాత్మజు డటుల జెప్పి మఱి యా కపివీరుల నటుగాంచీ!
మఱల జెప్పసాగెను నీ రీతిని మధురాక్షరయుత వాక్యములన్!
రామకార్యమును సఫలము జేసితి రాజకార్యమును సఫలంబున్!
సీతారాముల జతను గూర్పవలె జెలగి మనము బూనికతోడన్!

నే నొక్కనినే రాక్షసగణమును నిలిచి చంపుదును రణమందున్!
బలవంతులు మీరందఱు గూడిన బన్నుగ చెప్పెడి దేమింకన్!
పుత్ర మిత్ర బాంధవ సహితముగా పూర్ణాహుతి గావించెదనూ!
రాక్షస సేనల నన్ని దునిమి నే రావణువధ గావించెదనూ!

మహావీరుడగు జాంబవంతునికి మఱి యువరాజగు నంగదుకున్!
నీలుడు మైందుడు ద్వివిదుని యెదుటను నిలిచి పోరుదురె యెవరైనన్!
అట్టి వీరులందఱు గూడినచో నిట్టె జయింతును నా లంకన్!
తాను జేసిన పాపము తోడనె తా జచ్చును లంకేశ్వరుడూ!

లంకానగరపు రాజవీధులను లావుగ నే బ్రకటించితినీ!
జయము!జయము!మా రామచంద్రునకు జయము! జయము! లక్ష్మణునకునూ!
జయము! జయము! మా సుగ్రీవునకిక జయము! జయము! హరివీరులకూ!
రాక్షస నాశము లంకానాశము రహిఁ జరుగుననీ బలికితినీ!

మరణింపగ దా బూనుకొనిన యా మానిని సీతను గాంచితినీ!
ఓదార్చితి వానర సేనలతో వచ్చెద నని నే బలికితినీ!
రామలక్ష్మణులు లంకేశ్వరునీ రయమున ద్రుంతు రటంచును నే
పలికిన పలుకులు నిజము సేయవలె బలవీరులు కపి వీరు లికన్!

ఆ పావని విశదీకరింపగా నతిశయముగ యంగదు డనియెన్!
అశ్విని పుత్రులు మైంద ద్వివిదులు నతిబలవంతులు శూరులునూ!
బ్రహ్మదేవుచే వరముల బొందిరి బ్రతుకగ చిరకాలము భూమిన్!
అట్టివారలకు లంకదెంత మఱి యిట్టె రావణుని ద్రుంచెదరూ!

మీరందఱునూ నిలిచియుండు డిట మీఱిన నా బలశౌర్యములన్!
రక్కసులందఱ నేలగూల్చి మఱి రావణాసురుని జంపెదనూ!
మీరందఱు నా వెంట నున్న యిక మించిన కార్య మదేముండున్!
వాయుసూనుచే వింటిమి యిపుడే వడిలంకయు దగ్ధం బగుటన్!

అట్టియెడను మనమందఱు గూడుక యా శ్రీరాముల కడ కేగీ!
'సీతను గంటిమి' కాని యిచటి కా 'సీతను తేలే'దని పలుకన్!
యుక్తము గాదది వేగముగా జని రక్కసు ముక్కలుగా జేసి!
సీతను గైకొని రాఘవు కడకున్ జేరుట యుక్తం బని పలికెన్!

ఆర్తకోవిదుడు జాంబవంతు డా యంగదుతో నిట్లని పలికెన్!
'అంగద!' నీవతి బుద్ధిమంతుడవు! వలరి వినుము నా పలుకులనూ!
సీతను వెదుకగ బయలుదేరితిమి చెలగుచు దక్షిణ దిక్కునకూ!
అంతవఱకు మన కాజ్ఞయైన దిక యీ పని నెఱవేర్చితిమి గదా!

సీతను జయించి రాముని జేర్చిన శ్రీరాములు నేమనుకొనునో!
కుల మర్యాదనుబట్టి మన పనిని కూరిమి మెచ్చడు రాఘవులా!
సీతను జయించి తెచ్చెద ననుచును జెలగి ప్రతిజ్ఞను గావించెన్!
చేసిన ప్రతినను రిత్తజెప్పుటది చిత్తము నొప్పును రాములకున్!

కావున మన మీ పట్టున యూరక కార్యహాని చేయక వేగన్!
రామలక్ష్మణులు నున్న తావునకు నయముగ బోవుట యుక్తమగున్!
జరిగిన దంతయు నివేదించుదము సరసరీతి శ్రీరాములకూ!
కిష్కింధకు బోవుటయే మంచిది చెప్పన కేకల శుభవార్తన్!

అని పలికిన యా జాంబవంతుని యా కపి వీరులు నందఱునూ!
మన్నించిరిగా బహు బాగనుచును తిన్నగ కిష్కింధకు వేగన్!
బోవుద మనుచును బయనమైరి యా పవనసుతుడు ముందఱ నిలువన్!
మహేంద్ర గిరిపై నుండి యెగసిరీ మందగమనమున వినువీధిన్!

పోవుచున్న యా వానరవీరుల బొందుగ జూచుచు చారణులూ!
సిద్ధిని బొందగ దీవన లిచ్చిరి శీఘ్రము విజయము బొందగనూ!
అంతట కపులా గగన వీధిలో గాంతి రేఖలుగ కదులుచునూ!
కిష్కింధకు నతి చేరువ వచ్చిరి కిచకిచలను క్రిందికి దిగిరీ!

అచట జూచి రొక నందన వనమును నతిశోభను నా కపి వీరుల్!
సర్వభూతముల మనోహరంబగు శాంతి దాయకంబగు దానిన్!
సుగ్రీవుడు పోషించు దానినీ సురుచిర పుష్ప ఫలాదులతో!
మధువుల తోడను నిండియున్న యా మధువనమును గని యాసక్తిన్!

మధువనమునగల మధువును గ్రోలగ మనసూరెను హరివీరులకూ!
అనతి వేడిరి జాంబవంతునీ యా హనుమంతుని యంగదునీ!
సీతను జూచిన సంతోషంబున జెలగి వీర కపి నాయకులున్!
మధువుల గ్రోలగ నానతి యిచ్చిరి మధుర ఫలంబుల రుచి చూడన్!

యాజ్ఞనందిప్పే యా కపివీరులు నా మధువనమున గ్రుమ్మరుచున్!
కందమూలముల కమ్మని ఫలముల కడుపునిండుగా భుజియించీ!
తీయని మధువుల గ్రోలసాగిరీ తేనెల తీపుల మత్తిలుచున్!
సొక్కుచు సోలుచు మదోన్మత్తులై నిక్కుచు నీల్గుచు బరుగిడుచున్!

కొందఱు నవ్వుచు గొందరేడ్చుచును కొందఱు కొమ్మల దూకుచునూ!
చిందర వందర చేయసాగి రట చెట్టుకొమ్మలను దీసిలనూ!
మధువు ద్రావి మత్తెక్కనివా డట మాటమాత్రమున లేడొకడున్!
మధుపానముచే దర్పము గలుగని సదమలమతి లేనేలేడూ!

మధువన మిటులను ధ్వంసమగుట గని మఱి వనమాలీ దధిముఖుడూ!
సుగ్రీవుని యా మేనమామ యట సుందర వన భూరక్షకుడూ!
వనరక్షణకై ముందుకొచ్చి యా వనచరులను వే కోపించీ!
కొట్టసాగె, మఱి తిట్టసాగెనట! గోలజేసె గలహించుచునూ!

ఆతని పలుకులు లెక్కసేయకను యా కపులందఱు దధిముఖునీ!
వెక్కిరించి మఱి హాస్యముజేసిరి నిక్కిసీలుగుచు కిచకిచలన్!
దధి ముఖుడంతట బలవంతముగా మర్దింపగ దా బూనుకొనెన్!
కొందఱ లాగెను గొందఱ నీడ్చెను! గొందఱద్రోచును గోపమునన్!

అంత వానరులు నా వనరక్షకు నా మధుపాన మదంబులచే!
రక్కిరి గ్రిచ్చిరి పెనుగోరులతో గొఱికిరి దంతములను బలిమిన్!
చెంపదెబ్బలను జెళ్లున గొట్టిరి చింపి వస్త్రముల బొమ్మనిరీ!
వనమునంతయును నా కపివీరులు వన్నెమాపి రింతయులేకన్!

అంత పవనసుతు డా కపివీరుల నలరి వలికె నీ విధమువనూ!
ఇచ్చ వచ్చినటు మధువుల గ్రోలుడు నిష్పితంబు జల్లారునటుల్!
మిము నదలించెడి వారలెవ్వరో మేము జూచెదము మీకేలన్?!
అని పావని వలుకగ యంగదుడును నచటి కొచ్చి యిటులను బలికెన్!

కృతకృత్యుండై మారుతి వచ్చెను సీతను గాంచెను గనులారన్!
సంతోషంబుగ వార్తను దెచ్చెను సకల కపుల కిది వండువుగా!
అందులకే యిటు మధువులు గ్రోలుట చిందులు ద్రొక్కుట యిందులకే!
చెంగున నెగురుట! చెరచెర జారుట! చెట్టు కొమ్మలను దూకుటయున్!

అన విని వానరు లంత మోదమున యట జని యా కావలివారిన్!
అవల ద్రోచి మధువనము జొచ్చి మరి నలరి మధువులను గ్రోలి రటన్!
మధుర ఫలంబులు కందమూలములు మనసు దీర భుజియించి రటన్!
చెట్టుకొమ్మలను నెగురుచు దూకుచు నిట్టె ప్రాకిరట వృక్షములన్!

వనరక్షకు లట కేగి దధిముఖుకు వరుసగ జెప్పిరి యంతయునూ!
వనమంతయు నాశన మొనర్చిరని వరుసగ మమ్ముల నందఱనూ!
మోకాళులతో బొడిచి రంగముల మోద మలర దల్రకిందులుగా!
పడ ద్రోచియు మఱిపైకిని జూపిరి పన్నుగ చూడగ నాకసమున్!

వారలు జెప్పిన దంతయు విని యా వనపాలకుడగు దధిముఖుడూ!
మహాతరువు నొకదాని గైకొనెను మహాకపుల నట దరుముటకై!
పరుగున వచ్చెను వెల్లుగ నఱుచుచు బటపట వండ్లను గొఱుకుచునూ!
అతని పొంకమును జూచి వేగమున యంగదాదు లొచ్చిరి యటకున్!

తాత యనుచు మది దలప కంగదుడు దన చేతులతో బట్టుకొని!
వసుధా తలమున బడగపైచె దా గసిదీరగ పే గ్రుద్దుచునూ!
బాహాదువులను ముఖము నందునను బలమగు గ్రుద్దులు మోవగనూ!
రక్తసిక్తమై మొకలంతయుమూ రయమున మూర్ఛిలె దధిముఖుడూ!

కొంత సేపటికి దెప్పరిల్లి మఱి కోపముతో నా దధిముఖుడూ!
ఇంతజరిగె నే నెటులోపుదునూ శాంతముతో నే నెటులుందున్!
రండు! పోద మిక రాజును గలియగ జరిగిన వృత్తాంతంబంతన్!
తెలియజెప్పుదము దేటతెల్లముగ వాలిసుతుని యీ యాగడమున్!

సుగ్రీవుని దీ తోట మధువనము సుందరమైనది జగమందున్!
నందనవనమున సాటివచ్చునది చందన తరు పూ ఫలములతో!
అట్టివనము నీవేళ కిరాతులు గట్టిగ ధ్వంసము జేసి రిలన్!
ఎట్టి శిక్ష దండనల విధించునొ యెట్టి న్యాయమును జేసెడినో!

రండు రండు వే రండు పోదమని రక్షక వన భటులందఱినీ!
వెంట బెట్టుకొని దధిముఖు డప్పుడు కంటి నీటితో సుగ్రీవున్!
రామలక్ష్మణుల తోడనున్న యా రాజును జూచెను నాతురతన్!
దీనవదనుడై సాష్టాంగముపడి దిక్కులు జూచెను దీనముగా!

సాష్టాంగముపడు దధిముఖుతోడను సరసత కపిరా జిట్లనియెన్!
ఎందుకిటుల నా పాదములం బడి చిందెదు దుఃఖ మదెందులకో!
లెమ్ము! లెమ్ము! నీ కభయ మొసంగితి సమ్మతి దెల్పు మదంతయునూ!
మధువనమంతయు సురక్షితము గద! మన భటులందఱు శుభము గదా!

అంత దధిముఖుడు లేచి యిట్లనియె నా కపీంద్రుతో వినయముగన్!
తండ్రి తాతలును వాలియు మీరును తరతరాలుగా నందఱునూ!
మధువన మందున బ్రవేశ మొసగరు మాలిమి నెంతటి ఘనులకునూ!
నేడు జరిగె నతి ఘోరకార్యమది నిలిచి నోట జెప్పగలేనూ!
అంగదాది వానర వీరులచే నది విధ్వంస మాయె ప్రభూ!

మధుపులు గ్రోలుచు మధుర ఫలంబులు మనసు దీర భుజియించుచునూ!
ఎంతజెప్పినను వినరుగదా? నే నెంత యాపినను యాగరుగా!
కావలి వారల ద్రోసివేసిరీ కసి దీరగ నను బడవైచీ!
చిదుక గొట్టిరీ చిమ్మిరి! చిమ్మిరి! చేరి చూడు నా గాయములన్!

అంతట లక్ష్మణు డచటి కొచ్చి తా యా సుగ్రీవుని కిట్లనియెన్!
ఎవడీతడు? నిట కేందుల కొచ్చెను? నేల దుఃఖమును నొందు ననన్!
ఆపలుకుల విని యా కపీశ్వరుడు యా లక్ష్మణుతో నిట్లనియెన్!
దధిముఖు డీతడు! మేనమామ! నా మధువన రక్షకు డీతండే!

మన కపివీరులు మరలి వచ్చిరట మనయంగదుడును బావనియూ!
మధువన మందున వానర వీరులు మధువులు గ్రోలుచు మత్తిలియున్!
తోటను ధ్వంసము జేయుచుండిరని తోడ్తో కావలి వారలనూ!
తన్ని కొట్టిరని దెలుపుచు నా కిటు విన్నపమును జేయుచు నుండెన్!

సీతను జూచిరి కావుననే యిటు పొంది హర్షములు పెల్లుబికన్!
మధువనమున యిటు కొచ్చి బింకమున మధువుల గ్రోలుచు దరువులకై!
గంతులు వేయుచు నున్నవారు మన ఘన బలవంతులు హరి వీరుల్!
సీతను గాంచిరి కావుననే యిటు జెలగుట సంతస ముప్పతిలన్!

జాంబవంతుడును నంగదుండునూ సరసత నాయకులై యుండన్!
ఆదిష్ఠాతగా పావని యుండగ యా కార్యము సఫలం బగునూ!
సుగ్రీవుని నోటను వచ్చిన యా శుభకర సుందర వాక్యములన్!
రామలక్ష్మణులు మోదము నందరి రయమున సుగ్రీవుం డనియెన్!

దధిముఖ! విను! మన వానర వీరులు ధన్యులు పై దేహిని గాంచి,
వచ్చిన వీరులు కృతకృత్యులుగా మెచ్చితి క్షమియించితి వారిన్!
నీవు పోయి వారల నిటు బంపుము నీలాంగదులను బావనినీ!
అచట నుండి కాపాడుము వనమును నా మధువుల యా ఫలములనూ!

సుగ్రీవుం డటు బలుక దధిముఖుడు సుస్మితుడై యతి మోదమునన్!
రామలక్ష్మణుల సుగ్రీవునకును రమ్య నమస్కృతులను జేసి!
తనతో వచ్చిన కపులతోడుతను తగ నెగసెను గగనంబునకై!
ఎటుల వచ్చెనో యటుల పోయి యా యింపగు మధువనమున దిగియెన్!

వానర ప్రముఖుల జూచి దధిముఖుడు నొప్పగ యంగదు కిట్లనియెన్ !
క్షమియింపుడు! మము! దప్పు చేసితిమి! శాంతము గోల్పోతిమి మేమున్ !
అలసివచ్చితిరి దూరము నుండియు నలరి మధువులను గైకొనుడూ !
మఱి యువరాజవు ! రాజవు గూడను మఱి యీవనమును నీదె కదా !

నే నటకుం జని మీ పినతండ్రికి నివేదించితిని విషయంబున్ !
మీరట కొచ్చిన సంగతియును మఱి మీరట జేసిన కార్యములన్ !
విని సుగ్రీవుడు కోపగింపకను విమల వాక్యముల నిట్లనియెన్ !
'అంగదాదులను త్వరలో బంపుము' నాలస్యము జేయకు మనియెన్ !

దధిముఖు వాక్యములను విని కపులకు ధైర్యశాలి యంగదు డనియెన్ !
పిపలార ! యిక వేగము బోదము ! విమలవ్రతుడు రాఘవుకడకున్ !
వినియేయుంటను రామచంద్రు డట వేగముగా మన మెచ్చినదీ !
మధువుల గ్రోలితి మిక యేమున్నది మంచివార్త వినిపింత మికన్ !



## పావని సీతా సందేశమును
## శ్రీ రామచంద్రునకు దెలుపుట



మంచిది పోద మటంచు బలుకుచును మహా కపులు నందఱు గూడన్!
మింటికి కెగసిరి మేఘమేలన్! మింటి మేఘముల కైవడిని!
రామ! రామ! యని స్మరణజేయుచును రయమున గర్జన సేయచునూ!
కిల కిల శబ్దములను గావించుచు కలకల రాసాగిరి నింగిన్!

అంగదాదు లటు వచ్చుట గనుగొని నా సుగ్రీవుడు రామునితో!
రామచంద్ర! యిక యూరడిల్లుమా! రహి నీకు శుభంబగును నికన్!
సీతాదేవిని జూచి వచ్చి రిక చింతింపకు మన కష్టలంతా!
మిము దర్శింపగ వచ్చుచుండి రదె మీరిన హర్ష ప్రహర్షములన్!

కార్యసాధనము జేయకుండ నిటు గదలిరారు గపులందఱునూ!
అంగద నీలుని హర్షము గనుగొన యా పావని కళవళిక గనన్!
సంశయ మెందుకు? వారి ముఖంబులు గలకల లాడుచు నున్నవిగా!
ఆంజనేయుడే సీతాదేవిని గలిసి జూచెనని భావింతున్!

ఆ కపులందఱు నచట దిగిరి వే యల సుగ్రీవు సమీపమునన్!
ఆంజనేయు డపు డా శ్రీరాముల నలరి మ్రొక్కి నిటులను బలికెన్!
సీతాసాధ్విని జూచితి లంకను చిరతర వేదన గృశించుచున్!
పతివ్రతా నియమములతోడ నట పన్నుగ నున్నది జీవముతో!
నీ నామంబును జపించుచున్నది నిర్మలమతిగ తపస్వినిగా!

సీతను జూచితి నన్న పలుకు విని శ్రీ రాఘవు డానందమునన్!
హనుమంతుని బహు ప్రీతి యుక్తుడై యలరి చూచె బహుమానముగా!
లక్ష్మణుండు జూచెను నాదరమున లలి సుగ్రీవుని నాసక్తిన్!
సుగ్రీవుడు గపులందఱ జూచెను శుభ వీక్షణములు వొలుకాడన్!

అంత నందఱును నాచోటును విడి యా శ్రీరాముని వాసంబౌ!
ప్రస్రవణంబను పర్వతంబునకు బరగ ప్రయాణంబై యచటన్!
అందఱు గూర్చొని యా రాములకును జింద కరుణ జానకి వార్తన్!
తెలుప సాగిరట హరివీరులు నా తెలిపిన మారుతి చందమునన్!

రావణాసురుని చెఱయందున యా రమణి సీత కృశియించుటయున్!
రాక్షసస్త్రీలట బెదరించుటయును రక్కసు రావణు బెదిరింపుల్!
రామునిపైగల యనురాగమునూ! రమ్య తపోవ్రత దీక్షయునూ!
లంకానాథుడు బెట్టిన గడువును రయమున నంతయు జెప్పిరటన్!

సీత బ్రతికి యున్నట్లు తెలిసికొని శ్రీరాముడు గపులను బలికెన్!
వానరులారా! జానకి యెచ్చట? వైదేహిని గంటిరి యెచటన్!
ఏమనుచున్నది? యెటుల నున్నదియును క్షేమ సమాచారము లన్నీ
విశదముగా మఱి విన్నవించు డన వేగమె పావని యిటులనెన్!

ప్రాంజలియై యా సీతకు మ్రొక్కి అంజలితో దక్షిణ దిశకున్!
సీత యిచ్చినా కాంచనమణినీ శ్రీరాముల కర్పించి మఱిన్?
జానకి నెటులను గనుల గాంచినది సరగున తా నట జేసినదీ!
వివరముగా నిటు దెలుపగ సాగెను విమలవాక్య పద రుచిరముగన్!

సీతను జూడగ కోరికతోనే శతయోజన విస్తీర్ణమగూ!
నీరధి దాటితి లంక జూచితిని! నిర్మలమతి సీతను గంటిన్!
ఆ లంకను బాలించువాడు ఘను డా రావణుడను రక్కసుడూ!
అతని చెఱలో నశోకవనమున యాసీతా మహిషిని గంటిన్!

రాక్షస స్త్రీలట కావలి కాయుచు రమ్యశీల యా జనకసుతన్!
మాటిమాటికిని దుర్భాషలతో మాటలాడి వేధించుటయున్!
నీపైనే తన యాశలన్నిటిని నిర్మలమతియై యర్పించీ
తపస్వినికివలె తపోనియమముల తా జీవించుచు నున్నదియూ!

నిఖిల సుఖములను ననుభవింపదగు నీదు జీవితేశ్వరి యటనూ!
పలు బాధలచే వేదన నొందుచు విలపించుచున్నది చెఱలో!
ఏకవేణియై దీనవదనమున నింపుగ నిను మది దలచుచునూ!
కటిక నేలపై మలినాంబరమున కటికుపవాసములను దీక్షన్!

నిను నే దలచుచు లంక నంతయును విను వీధులు నంతఃపురముల్!
వెదకి వెదకి సీతను గనుగొంటిని యెద ముద మందితి నావెంటన్!
మీ వంశమునూ మీ చరిత్రమును మిక్కుటముగ నే వర్ణింపన్!
నన్ను విశ్వసింపగ జానకిసతి సర్వము వినిపించితి నంతన్!

అంగుళీయమును నర్పించితి నే నింగి పెరిగి నను జూపితినీ!
రామ సుగ్రీవుల మైత్రిని విని తా రమ్య హర్షమున నుప్పొంగెన్!
లంకేశ్వరు నట జూచితి సభలో లంకను బుగ్గిగ గాల్చితినీ!
దేవి యిచ్చినా చూడామణినీ దెచ్చితి మీ కభిజ్ఞాతముగాన్!

చిత్రకూట పర్వతము నందునను చిత్రమైన కాకాసురునీ!
కథయంతయు దా విప్పి చెప్పినది క్రమ్మఱ వినిపింపగ మీకున్!
మనశ్శిలా తిలకము దిద్దుటయను మానుగ జెప్పెను వినిపింపన్!
అన్ని దెలిపి తన చివరి మాటగా యా జానకిసతి యిట్లనియెన్!

దశరథు నందనుతో నిటు దెలుపుము దయ యుప్పొంగగ నాపైనీ!
రాక్షసస్త్రీలకు వశమై యుంటిని రక్కసు చెఱలో నుంటినుమా!
రెండు మాసములు గడువును బెట్టెను దండి రక్కసుడు రావణుడూ!
నే జీవింపను మాసముకన్నను నిజమని దెలుపుము విభుతోడన్

అని పలికిన సీతను గాపాడగ నరుగవలయు మన మందఱమూ!
సాగరజలముల దాటి లంకకును సరగున బోవలె రఘురామా!
అట్టి ప్రయత్నము జేయవలయు సుమ! యాలస్యము లేకింతయునూ!
అంతయు జెప్పితి యాది మొదలుగా యా సీతా వృత్తాంత కథన్!

జనకసుతా వృత్తాంత కోవిదుడు జతురత మారుతి వినిపింపన్!
పవనసుతుని బహు యాదరంబునను బన్నుగ జూచెను రాఘవుడూ!
పావని యిచ్చిన మహారత్నమును బన్నుగ యెదపై నుంచుకొనీ!
సీతయె యెదపై నున్నయటులుగా చింతా వేదన శోకములన్!
కన్నీటిని ముత్యాల కోవవలె కలకల రాల్చెను విరహమునన్!

అశ్రుపూర్ణ నేత్రముల రాఘవుడు నా సుగ్రీవుని నిట్లనియెన్!
దూడపైని గల వాత్సల్యముతో దుగ్ధము నెటుల స్రవించెడినో!
ధేనువు వలె నా హృదయము గూడను తేకువ మణి దర్శించుటచే
గరగుచు నశ్రువులను స్రవించుచును కదులుచున్నదీ యెటకెటకో!

వివాహ సమయమునందు జానకికి వేడుక జనక మహారాజూ!
బహూకరించిన బహుమానం బిది పన్నుగ తండ్రియు, మామయును
కనుల ముందు నిలుచున్నయట్లుగా గనపడుచున్నది గతమంతా!
సీత ఫాలమున శోభించెడి దిది సింధూరముపై కాంతులతో!

ఓ సౌమ్యుడ! ఓ పావని తెలుపుము! నొప్పుగ జానకి వార్తలనూ!
ఇంకను దెలుపుము నేమి చెప్పినది యెట్లు దెలిపినది యంతయునూ!
తద్వియోగమున మూర్ఛనొందితిని తద్వార్తలనే వస్నిటన్!
నాపై జల్లుము! ననుదేర్పుము! నిక నా జానకి సందేశమునన్!

ఓ సౌమిత్రీ! నింత కంటె మఱి యొనరగ దుఃఖ మదేముండున్!
జానకి లేకను జనకజ ధరించు చారుమణిని గాంచుచుంటిన్!
ఒకమాసము జీవింతు ననుచునూ యొనరగ బలికెను జనకసుతా!
సీతలేక నే క్షణకాలమునూ బ్రతుక జాల సుమి! సౌమిత్రీ!

వానరోత్తమా! నను గొనిపొమ్మిక జానకి యుండెడి తావునకున్!
ఆమె వార్త తెలిసిన తదుపరి యిక నిలువ జాలను సుమ్మీ!
సీత మృదుల! బహుభీరు! మృగనయని! భీకర రాక్షస మధ్యమునన్
ఎటు జీవించుచు నున్నదియో మఱి యెటు ఘొల్లుచు నున్నదియో!

రోగి మందుతో బ్రతికిన విధమున బ్రదికెద నే సీతావార్తన్!
మధురాలాపిని! మధుర మూర్తియగు మా జానకి యేమని జెప్పెన్!
ఇంక యింక మఱి యేమి చెప్పినది యింపుగ నాతో దెలుపమనీ!
కష్టముపై కష్టమును భరించుచు కాంత యెటుల యట నున్నదియో!

ఈ విధమున రాఘవులు బలుకగా నావిధి జానకి తెలిపినదీ!
విషయ మంతయును బూస గ్రుచ్చినటు వివరముగా బావని దెలుపన్!
ఓ రాఘవ! పురుషోత్తమ! వినుమా! యొప్పుగ నీయభిజ్ఞానముగా!
చిత్రకూటమున జరిగిన వృత్తము జేరి వినయమున దెల్పు మనెన్!

నీ యంకంబున నిదురించిన యా నిర్మలవతి జానకిదేవి!
ముందుగ లేచెను నిదురనుండి మఱి యెందుండొచ్చెనొ వాయసమూ!
హృదయమందునను ముక్కున బొడిచెను ముదిత సీత భయమందగనూ
అంత నీవు సీతాంకమునందున నలరి సుఖమునను నిదురింపన్!

మజల పొడువగా నున్న వాయసము మానిని సీతాదేవి యటన్!
కాంచి భీతి నొందగ తగ విదురను గలగి లేచి జూచితి వంతన్!
ఆ వాయస మది యింద్రుని కొడుకట యతి బలవంతుడు వాయసమై!
ఈవిధి స్త్రీలను నిడుమల బెట్టుచు నింపుమీర నటు దిరుగునటా!

కోపముతో నావాయసంబునకు తాప మడచి శాస్తిని జేయన్!
దర్భపుకక నొక దానిని గైకొని దానిని బ్రహ్మాస్త్రము జేసి!
మంత్రయుక్తముగ బ్రయోగించితివి మరుమాటాడక కాకముపై!
వాయసంబు బయవెత్త సాగెనట వరుసను బ్రహ్మాస్త్రము గూడన్!

మూడులోకములు దిరిగె వాయసము మోదమలర దేవత లెవరున్!
శరణము నివ్వరు; రక్షణసేయరు శాంతినిచ్చి భీతిని బాపి!
తిరిగి తిరిగి యది నీకడ కొచ్చెను శరణని నిన్నే ప్రార్థించెన్!
పదములపై బడి ప్రార్థన సేయగ పన్నుగ జాలిని బొందితివి!

బ్రహ్మాస్త్రము నట వ్యర్థముసేయగ పరగ తగ దనెడి భావనతో!
కుడి కన్నొక్కటి లేమి జేసితివి కూరిమి జూపుచు వాయసమున్!
అంత కాకి తన తప్పు తెలిసికొని యతివల జోలికి బోననుచున్!
నీకు మ్రొక్కి సీతంద్రి దశరథుకు నిర్మలమతి మ్రొక్కుచు తరలెన్!

ఈ వృత్తాంతము జెప్పి సీత నిను నిమ్ముగ దలచుచు బ్రార్థించెన్!
'ఓ రాఘవ! నీవస్త్రకోవిదుడ వానరగశ్రేష్ఠుడ వందఱిలో!
ఏల నుపేక్షను సేయుచుంటివో యీరాక్షసునీ వధియింపన్?
లక్ష్మణుడైనను అన్న యాజ్ఞగొని రాడుగదా నన్నాదుకొనన్!
ఏదో దోసము జేసియుంటి మఱి యేలరాదొకో! రక్షింపన్!

ఆ వైదేహికి యతి వినయముగా నలరిజెప్పి యోదార్చితినీ!
ఓదేవీ! ఓ జనకనందినీ! యొప్పుగ నామాటలు వినుమా!
శ్రీరాముడు నీశోకము జేతను జేయగ వలసిన కార్యములన్!
వైముఖ్యముచే నున్నవాడు మఱి వన్నెతగ్గె చిర చింతముచేన్!
లక్ష్మణుండు బరితాపము నొందెను వీక్షించుచు శ్రీరామవిభున్!

నిన్ను జూచితిమి యికపై జూడుము గన్నుగాననీ రావణునీ!
రణమునందునను వధింతు రింకను రాజకుమారులు శౌర్యమునన్!
లంకంతయు ధ్వంసంబగు నిక్కము లావు కపుల బలవీర్యములన్!
నయోధ్య నినుగొనిపోవు నీ విభుడు నీరజాక్షి! శోకింపకుమా!

అభిజ్ఞానమును నిమ్మని గోరగ యలరి యిచ్చె చూడామణినీ!
తిరిగిపోవ నే బెంప శరీరము తేకువ జూచుచు కన్నీటన్!
మహాకపీ! నీవదృష్టజీవివి! మహాతేజుడా రామ విభున్!
కనుల జూచెదవు రామలక్ష్మణుల గాంతువుగద! కనుపండువుగాన్!

అని పలుకగ నేనంటి దేవితో నతివినయమునను ఓ దేవీ!
పృష్ఠభాగమున నధిరోహింపుము గష్ట మనక నిను గొనిపోదున్!
అలరాముల లక్ష్మణుని తోడుతను నా సుగ్రీవుని జూపింతున్!
వానరవీరుల నందఱ జూపుదు వరుసను నంగదు మైందులనూ!

అని నే పలుకగ దేవి యిట్లనియె నతిశాంతము బెల్లుబుకగనూ!
హరిపుంగవ! యట్లనుట సరికాదు నంటను ముట్టను పరపురుషుని!
ఓటని నీరధి బడిపోవుదునో నీతివంత! పొమ్మిక వేగన్!
నా సందేశము వినిపింపు మచట నయముగ నావిభు రాఘవుకున్!

సింహసమానులు రామలక్ష్మణులు జేరి దెలుపు నా క్షేమమునూ!
అమాత్య సహితుడు సుగ్రీవునకును నఖిల వీరకపి శ్రేష్ఠులకున్!
నే బడు బాధల విన్నవింపుమా! నీ జూచిన దంతయు జెప్పుమా!
నీవు బోవు మార్గము మంగళమై నీకు భద్రమగు నిఖిలంబున్!

మహాబాహు సంపన్నుడు రాముడు మహాదుఃఖమున నున్న ననున్!
ఎటుకాపాడునో! యెటు రక్షించునో! నటుల దెలుపుమా కపివీరా!
ఇటు పొందెడు దుఃఖమును వేదనను నిచటి రక్కసుల బాధలనూ!
ఈ రాక్షస బెదిరింపుల దెలుపుము వినవంశ తిలకునకు వేగన్!
నీవు పోవు మార్గము మంగళమై నీకు భద్రమగు నఖిలంబున్!

పూజ్యురాలు! నిర్మల! పతివ్రతయును పూర్ణచంద్రముఖి! జనకసుతా
విషాద పూర్వక సందేశమునూ విన్నవించినది రామప్రభూ!
నే జెప్పిన విషయము నంతయునూ నిర్మలగుణ! యోచింప తగున్!
సీత క్షేమమని తెలియుచు మీరలు చిత్తగింపవలె నా వినతిన్!

పురుషోత్తమ నీయందు నున్న పరిపూర్ణప్రేమ సౌహార్ద్రితలన్!
నన్ను జనకసుత గౌరవించినది నయముగ తనయుని వలె జూచెన్!
మఱి సంభ్రమముగ వాతో బలికెను మమత విరియ సౌహార్ద్రితతో
ఒక్కదినము మఱి లంక నుండుమని జిక్కబట్టి ధైర్యము తోడన్!

సంవిధానమున నుండుట చేతను శాంతి బొందుదును బవనసుతా!
రాక్షస బాధలనుండి ముక్తనై రహి నున్నటులుగ భావింతున్!
తిరిగి వత్తునని మఱలిపోవగా దిమిరము గన్నుల వ్యాపించున్!
సందియ మింతయు లేదు మారుతీ! సంకటమున బడు జీవములున్!

రణమున రావణు జంపి వేగమున రహి నను గొంపోవంగలడో!
ఆవిధమున నా విభునకు దెలుపుము నాలోచనలను బవనసుతా!
సందియ మొక్కటి గలుగుచునున్నది సత్వరముగ నీ సంద్రమునూ!
వానర భల్లూకముల సైన్యములు వచ్చు నెటుల? దాటుట యెటులో!

నా ప్రశ్నకు నీసమాధాన మెటు నయముగ యిచ్చెదవో చెపుమా?
నీ వొక్కడవే కార్య నిర్వహణ నిర్ణయించు వాడవు సుమ్మా!
లంక జయించియు, రావణు ద్రుంచియు శంకలేక గొనిపోయినచో!
రాముని శూరతకున్ దగియుండును రమ్యశీల! యటులన్ జెపుమా!

రావణు డెట్టుల నను గొనిపోయెనొ రాముడటుల గొనిపోరాదూ!
పరాజయంబున పరాభవమునను పాతకుండు మృతి నొందవలెన్!
పరస్త్రీ నంటుట పాపమనుచు నా పంద తెలిసి చింతింప వలెన్!
లోకమునకు నొక పాఠము గావలె లోలత నాశంబగు నంచున్!

అని జానకి పలుకగ నే బలికితి యలరి వినయముగ జానకితో!
వానర సైన్యమునకు ప్రభువగు నా వినయశీలి సుగ్రీవుండూ!
సీతను విడిపింపగ నిశ్చలుడై నీ విభుతోడను ఘన మైత్రిన్!
నెఱపుచున్నవాడో జానకిసతి! నిండు మనసునను నంకితమై!

మహాసత్త్వులగు వానరవీరులు మఱి యాతని యానతులోనై!
ఎదురుజూచుచుందురు వినుమో సతి! విక్రమోన్నతులు నా కపులూ!
సంతాపింపకు! సాధ్వి! గంతులో సర్వ వీర కపిలోకంబున్!
లంకాద్వారము దట్టుట త్వరతో శంకలేక వినగలవు సుమా!

ధనుర్ధారులగు రామ లక్ష్మణులు దర్శనమిత్తురు సతి త్వరలో!
రావణాసురుని హతమొనరింతురు రయముగ గొనిపోదురు నిన్నున్!
రాముడయోధ్యకు నభిషిక్తునిగా రయముగ జూతువు జనకసుతా!
రామరాజ్యమట వెలయుట జూతువు రహి యర్ధాంగిగ శోభిలుచున్!

మంగళ మయమగు ప్రీతి వాక్యముల మధురమూర్తి సీతామాతా!
శాంతి వహించెను జెదిరి తిమిరములు గాంతి లేఖ కన్నుల వెలిగెన్!
పోయిరమ్మనుచు దీవన లిచ్చెను దీపలేఖ వలె తేజమునన్!
అరుంధతికివలె యనసూయకువలె యాపరమేశ్వర సతికి వలెన్!

సమాప్తము

# శ్రీ రామ పట్టాభిషేక ఘట్టము

అరుంధతి ప్రియుడైన వశిష్ఠుడు నా రాముని సీతాలక్ష్మిన్!
రత్నజటిత కాంచన పీఠంబున రయమున గూర్చుండగ జేసెన్!
వామదేవ జాబాలి కాశ్యపులు వరుసను అష్టసుయాజ్ఞికులున్!
సుగంధ జలముల నభిషేకించిరి సుశ్రీయుతుడగు శ్రీరామున్!

అజుని చేత నిర్మింపబడిన యా యద్భుత రత్న కిరీటమునూ!
వేదమంత్రముల నలంకరించిరి వేదవిదులు శ్రీరాములకూ!
ఈ కిరీటమును మనువు ధరించెను ఇక్ష్వాకుల వంశపు రాజుల్
ధరించి రాజ్యము పాలన జేసిరి ధర్మము నాలుగు పాదములన్!

శ్రీరాముల కప్పు డా శత్రుఘ్నుడు శ్వేత ఛత్రమును బట్టుకొనెన్!
విభీషణుండును, సుగ్రీవుండును విసిరిరి బట్టుక చామరముల్!
కాంచనహారము ముక్తాహారము గానుక లంపెను వాసవుడూ!
అచ్చరలాడిరి యాటపాటలను ముచ్చటలాడిరి దేవతలూ!

పుడమి యంతయును నా సమయంబున పులకరించినది సస్యములన్!
పూవులు వెదజల్లెను సౌరభములు పులకరించె ప్రకృతియంతా!
ఆ సమయంబున నారాఘవుండు నలరిజేసె బహుదానములన్!
కోరినవారికి కోరినవస్తువు గూరిమి ప్రజ సంతసమందన్!

మిత్రుడైన సుగ్రీవునకప్పుడు మేలిమి బంగరు దండయునూ!
దండకడియములు నంగదు కిచ్చెను సింగారింపగ బాహువులన్!
మంచి ముత్తెములతో గూర్చిన యొక మాల సీత మెడలో వేసెన్!
దాని తీసి జానకి హనుమన్నకు తగ ప్రసన్నతతో నిచ్చెన్!

వానర ప్రముఖుల విభీషణాదుల వరుసను సంతుష్టుల జేసి!
భూషణాంబరములను నర్పించి పులకిత గాత్రుల జేయ నటన్!
అంత వారలందఱు సంతృప్తిగ యాదరమున సంతుష్టులునై
తమతమ నిలయములకు జని రందఱు దనివిదీర సత్కారములన్!

మహాయశస్సంపన్నుడు రాముడు మధురమూర్తి యానందముతో
చిరకాలము రాజ్యము పాలించెను జేసె యజ్ఞముల నెన్నెన్నో!
భూరి దక్షిణల నాచరించె ఘన నూరశ్వమేధ యాగములన్!
ధరాతలంబును బరిపాలించెను ధర్మము నాలుగు పాదములన్!

రాముడు రాజ్యము సేయుచుండగా రహి ధర సస్య శ్యామలమై!
ప్రజలందరు సుఖశాంతినొందిరి ప్రసన్నులై సంతుష్టులునై
దారిద్ర్యంబును నెఱుగరా ప్రజలు దాస్యమనునదియు నెఱుగరుగా!
అల్పవిషయముల జగడములాడరు స్వల్పమునసె సంతృప్తిగనీ!

మహాత్ముడగు వాల్మీకులవారూ మరి చిరి యీ ఘనకావ్యమునూ
రాముడు మన కెపు డాదర్శముగా రహి నుండుటకై యెల్లపుడున్!
చదివిన వ్రాసిన వినిన గూడనూ సద్బుద్ధులు మన కలవడునూ!
కర్మక్షేత్రమున కార్యసాధనకు కమ్మని దారుల నందింపున్!

మంగళమగు మన రాములవారికి మంగళమగు మన జానకికి!
మంగళ మగు లక్ష్మణ దేవరకును మంగళ మగు నా భరతునకున్
మంగళమగు మన పవనసుతునకును మంగళమగు సుగ్రీవునకున్!
మంగమగు మన కపివీరులకును మంగళ సుందర కాండకునూ
మహాదాదర్శములను జూపిన మన మధురభారతికి మంగళమూ!



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థ వారి

అనుమతి పొందినవి.

2268/తె 800/1484

1. నాలో వెలిగే దీపాలు (బాలసాహిత్యం) 0–50

2269/తె 800/1485

2. విజయ మంగళం (గీతములు) 4–00

2270/తె 800/1486

3. అందరికీ నచ్చిన కోడలు (నాటిక) 2–00

2909/తె 800/1892

4. ఉత్తర గోగ్రహణము (బుర్రకథలు) 2–00

3649/తె 700/35

5. శ్రీ కందుకూరి. శ్రీ సరోజినీదేవి (బుర్రకథలు) 2–00

3756/తె 800/2444

6. ఆనంద మంగళం (లలిత గీతాలు) 4–00

3757/తె 800/2445

7. నాట్యశాల (నాటిక) 4–00

4560/800/3026

8. గోపబాలక శతకము (పద్యములు) 1–50

4561/800/3027

9. భూమితల్లి బిడ్డలు (నాటిక) 2–50

6622/తె 800/4551

10 పాలేటి తరగతిలో మల్లి (పాటలు) 5–00

| | | | |
|---|---|---|---|
| | 6623/తె 800/4552 | | |
| 11. | వేద దీపం | (కవితలు) | 4-00 |
| | 6624/తె 800/4553 | | |
| 12. | వినయాంజలి | (కవితలు) | 4-00 |
| | 6936/ తె 200/680 | | |
| 13. | శ్రీరామచంద్ర సుధ | (పాటలు) | 4-00 |
| | 7031/తె 800/4834 | | |
| 14. | ఝాన్సీరాణి | (బుర్రకథ) | 2-50 |
| | 7462/తె 800/5129 | | |
| 15. | కృష్ణదాసి | (లలిత గీతాలు) | 4-00 |
| | 8964/తె 800/5933 | | |
| 16. | చిగురులు—పువ్వులు | (గేయములు) | 4-00 |
| | 8965/తె 800/5934 | | |
| 17. | పాలేటి తరగతుల్లో మల్లి | (పాటలు) | 5-00 |
| | 8966/తె 800/5935 | | |
| 18. | శోణ పద్మం | (నాటిక) | 3-00 |
| | 8967/తె 800/5936 | | |
| 19. | హరిదాసు | (పాటలు) | 2-00 |
| | 8991/తె 800/5514 | | |
| 20 | పూలరథం | (గేయములు) | 4-00 |
| | 9698/తె 900/572 | | |
| 21. | శ్రీ అల్లూరి | (బుర్రకథ) | 3-00 |
| | 10035/తె 800/6768 | | |
| 22 | ప్రతిధ్వనులు | (వచన కవిత) | 4-00 |

11028/తె 800/7349

23. గోదాదేవి పాటలు (పాటలు) 2-00

11679/తె 800/7794

24. గిరిజా కళ్యాణము (ద్విపద) 10-00

12686/ తె 800/8429

25. ఎఱ్ఱనపోతనల కవితామాధుర్యము (తులనాత్మక పరిశీలన) 10. 00

2717/తె 800/425

26. మౌనగీతాలు (లలిత గీతాలు) 5-00

నూతన ప్రచురణలు

27. కన్నీటి పువ్వులు (లలిత గీతాలు) 8-00

13660/తె 800/9061

28. శాంతిగీతం (ముత్యాల సరాలు) 6-00

13661/ తె 800/ 9062

29. మురళీ స్వనాలు (లలిత గీతాలు) 8-00

30. మధుర గోపిక (లలిత గీతాలు) 8-00

---

ప్రతులకు :

పి. దుర్గారావు, ఎం.ఓ.ఎల్.,

తెలుగు పండిట్

చెఱుకుపల్లి పోస్టు, (వయా) నక్రేకల్,

నల్లగొండజిల్లా.